

బొబ్బిలిలోని వేణుగోపాలస్వామి ఆలయగోపురం

ఫొటో. డి పాల్, విజయనగరం.]

సంవత్సర చందా
రు. 13—0—0
విడిప్రతి 25 న.పై.



# సచిత్రవారపత్రిక

Founder: K. NAGESWARA RAO

సంపుటము 52
సంచిక 4
18-9-57

హేవిళంబి భాద్రపదం, బహుళ నవమి, బుధవారం


 విషయానుక్రమణిక 

ముఖచిత్రం:
అనుపమా ఫిలింస్ వారి
'ఎం. ఎల్. ఏ.' చిత్రంలో
సావిత్రి

★

## రిజర్వుబ్యాంకు సమీక్ష

# ప్రణాళిక అంచనాల తారుమారు

భారత ఆర్థికవ్యవస్థ ప్రస్తుతం చాలా క్లిష్ట స్థితిలో ఉన్నదని ఇటీవల ప్రకటింపబడిన రిజర్వ్ బ్యాంక్ డైరెక్టర్ల నివేదిక ప్రభుత్వాన్ని, ప్రజలను హెచ్చరించింది. ఇది అనేక విధాలుగా అతి ముఖ్యమైన నివేదిక. ఇప్పటి క్లిష్టస్థితికి కారణాలను, దాని నివారణోపాయాలనుకూడా ఈ నివేదిక వెల్లడించింది. 1957 జూన్‌తో అంతమైన సంవత్సరంలో దేశ ఆర్థిక పరిస్థితిని సమగ్రంగా సమీక్షిస్తూ, పెట్టుబడులు బాగా అధికమైనాయనీ, దేశంలోనుంచి, వెలుపలనుంచి సమకూర్చుకో గలిగిన ధనాన్ని మించి ఈ పెట్టుబడులు జరగడంవల్ల మన ఆర్థిక వ్యవస్థమీద మోయరాని భారంపడిందనీ రిజర్వ్‌బ్యాంక్ నివేదిక తెలుపుతోంది. ఈ కారణంచేత రెండవ ప్రణాళికలోని లక్ష్యాలలో ఏవి ప్రధానం, ఏవి అప్రధానం అనే విషయం పునర్విమర్శ చేసుకోవలసిన సమయం వచ్చిందని రిజర్వ్ బ్యాంక్ హెచ్చరిస్తోంది.

రెండవ ప్రణాళిక దాదాపు ప్రకటింపబడిన నాటినుండీ, దాన్ని యథాతథంగా అనుకున్న ప్రకారం అమలు జరపడం అసాధ్యమనీ, ప్రణాళిక లక్ష్యాలకు, చేతికందే ధన సాధనసంపత్తికీ ఎక్కడా పొంతన కుదరడం లేదనీ, అందుచేత ఆ లక్ష్యాలు అవాస్తవికముగా ఉన్నాయనీ పలువురు దూరాలోచన గల విమర్శకులు అంటూ వచ్చారు. ప్రణాళిక ఆచరణ సాధ్యం కావాలంటే కొన్ని అప్రధానాంశాలను వదలివేసుకోవడమో, లేక ప్రణాళిక కాలాన్ని పొడిగించడమో తప్పదని ఈ విమర్శకులు సూచించారు. అయితే అప్పట్లో ఈ విమర్శకుల దూరాలోచనను దురాలోచనగా పరిగణించారు. వీరిని అభివృద్ధి నిరోధకులుగా, నిరాశావాదులుగా ప్రభుత్వ నాయకులు అవహేళన చేశారు. ప్రణాళికలో ఒక్క అక్షరం, ఒక్క అంశం మార్చకుండా అనుకున్నది అనుకున్నట్టు, అనుకున్న కాలపరిమితిలో నెరవేరుస్తామని పదే పదే ఉద్ఘాటించారు. ఈ ఉద్ఘాటనలు ఎన్నికల ప్రచారానికి పనికి వచ్చిన మాట నిజమేగాని, ఇవి ప్రణాళికలోని అవాస్తవికతను వాస్తవికతగా మార్చలేకపోయాయి. ఇప్పుడిప్పుడు ప్రభుత్వం ఈ విషయాన్ని నెమ్మది నెమ్మదిగా గుర్తిస్తోంది. ప్రణాళిక అంచనాలు మొదట అనుకున్న దానికంటె చాలా పెరిగిపోయాయని, యథాతథంగా అమలుచేయాలంటే రూ. 5500 కోట్లు అవుతుందనీ ఇటీవల ఆర్థికమంత్రి టి. టి. కృష్ణమాచారి అంగీకరించారు. అయితే కొన్ని అప్రధానాంశాలను మానుకునీ, కాలపరిమితిని పొడిగించీ, నిర్వహిస్తే మొదట అనుకున్న 4800 కోట్ల రూ. పరిమితిలోనే ప్రణాళికను ముగించవచ్చునని ఆయన అభిప్రాయపడ్డారు. ప్రణాళిక రచనా సమయంలో లేని కొన్ని కొత్త సమస్యలు ఇప్పుడు ఉత్పన్నమైనాయనీ, వీటివల్లనే అంచనాలు తారుమారైనాయనీ కేంద్ర కార్మికమంత్రి శ్రీ జి. ఎల్. నందా వెల్లడించారు.

ఇలా కొత్తగా ఉత్పన్నమైన సమస్యలను రిజర్వ్‌బ్యాంక్ నివేదిక పరిశీలించి, వీటి పరిష్కారానికి కొన్ని మార్గాలను సూచిస్తోంది.

మొదటిది ధరలసమస్య. 1956–57సం॥లో వ్యవసాయిక ఉత్పత్తి, పారిశ్రామికోత్పత్తి ఆక్రితం సంవత్సరంలోకంటె పెరిగాయి. ఉత్పత్తి అధికమైనప్పుడు సహజంగా ధరలు పెరగకూడదు. కాని 1956–57సం॥లో ఉత్పత్తితోపాటు ధరలుకూడా పెరిగాయి. దీనికి ఆహార ధాన్యాలను బ్యాంకు ఋణాల సహాయంతో దాచడం కొంత కారణమైనప్పటికీ, ముఖ్య కారణం పెట్టుబడులు విపరీతంగా పెరగడమేనని చెప్పాలి. ధరలను అదుపులో పెట్టడానికి భారీ ఎత్తున అమెరికానుంచి ఆహారం దిగుమతి చేసుకోవడం, చవక ధాన్యపు దుకాణాలను ఏర్పరచడం, పరపతిని పరిమితం చేయడానికి రిజర్వ్ బ్యాంక్ అనుసరించిన విధానాలు ఇవన్నీ కొంతవరకూ తాత్కాలికంగా తోడ్పడవచ్చు. కాని దీర్ఘకాలిక దృష్టితో చూస్తే ఇవి అంతగా సహాయపడవనీ, ఉత్పత్తిని పెంచి, అందుకనుగుణమైన ద్రవ్య, ఆర్థిక విధానాలను అనుసరించాలనీ రిజర్వ్‌బ్యాంక్ సూచించింది.

మన ఆర్థికవ్యవస్థపై భారం అధికం కావడానికి మరొక కారణం విదేశవాణిజ్యంలో మనం ఇవ్వవలసిన మొత్తాలు అధికం కావడం. అభివృద్ధి కార్యక్రమాలకుగాను గత సంవత్సరంలో ప్రభుత్వరంగంలోను, ప్రైవేటు రంగంలోనుకూడా దిగుమతులు అధికమైనాయి. పారిశ్రామిక వస్తువులే కాకుండా, ఆహారధాన్యాలుకూడా ఎక్కువగా దిగుమతి చేసుకోవలసివచ్చింది. రిజర్వ్ బ్యాంక్ తాలూకు స్టెర్లింగ్ నిల్వలు 227 కోట్లరూపాయలు తగ్గి, ప్రస్తుతం 457 కోట్ల రూ. లకు దిగిపోయాయి. ఇదికాక అంతర్జాతీయ ద్రవ్యసంస్థవద్ద మరొక 95 కోట్ల రూ.లు అప్పుచేయవలసివచ్చింది. ఈ పరిస్థితిని వారించడానికి ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకున్నది: విదేశసహాయం కావలసి, ఇంకా మొదలుపెట్టకుండా ఉన్న కార్యక్రమాలను నిలిపివెయ్యడం, దిగుమతి కోటాలను తగ్గించడం, విదేశీ ప్రయాణాలను అదుపుచెయ్యడం మొదలైన చర్యలు ప్రభుత్వం తీసుకున్న మాట నిజమే. కాని వీటికంటె ముఖ్యమైన చర్య, దేశంలో సరుకుల వాడకం తగ్గించి, మిగిల్చి ఎలాగయినా ఎగుమతులను అధికం చెయ్యడం అని రిజర్వు బ్యాంక్ సూచించింది.

రిజర్వ్ బ్యాంక్ నివేదిక ఒక ముఖ్యవిషయాన్ని స్పష్టం చేస్తున్నది. రెండవ ప్రణాళిక లక్ష్యాల ననుసరించి కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాలు దేశంలోను, దేశం వెలుపలా లభ్యమయ్యే ధనాన్ని మించి పెట్టుబడి కార్యక్రమాలను అమలు చేస్తున్నాయి. ఇందువల్ల దేశంలో లోటుబడ్జెట్ విధానము

## ★ ప్రణాళిక అంచనాల తారుమారు ★

అనుసరించవలసి వచ్చింది, విదేశాలలో స్టెర్లింగ్ నిల్వలు తగ్గిపోవడము, అంతర్జాతీయ ద్రవ్యనిధివద్ద ఋణం చేయడమూ జరిగింది ప్రణాళికపై పెట్టుబడులు 1955-56 లో 600 కోట్ల రూ లుండగా, 1956-57 లో 761 కోట్ల రూ లు, అయినాయి 1957-58 లో 900 కోట్ల రూ లు ఉన్నాయి దీనివల్ల దేశమంతటా లోటుబడ్జెట్ విధానాలే శరణ్యమైనాయి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెట్లలో 1956 57 సం॥ లో 250 కోట్ల రూపాయల లోటు ఉన్నది ఇది అక్రితం ఏడాది లోటు కంటె 100 కోట్ల రూపాయలు ఎక్కువ 1957-58 లో ఒక్క కేంద్రం బడ్జెట్‌లోనే 280 కోట్ల రూపాయలదాకా లోటు అంచనా వేయబడింది రాష్ట్రాల బడ్జెట్ లోటు 86 కోట్ల రూపాయలదాకా ఉంది

ఈ లోటునుబట్టిచూస్తే లభ్యమయ్యే ధనం కంటే వ్యయమే ఎక్కువగా కనిపిస్తున్నది ఈ అధికవ్యయమే దేశంలో ద్రవ్యోల్బణం అధికం కావడానికి ముఖ్యకారణం ఈ పరిస్థితుల్లో ధరలను అదుపులో పెట్టడానికి, పరపతిని అదుపులో పెట్టడానికి చేస్తున్న ప్రయత్నాలు ఫలప్రదమయ్యే సూచనలు కనిపించవు

1956-57 సం॥లో చిన్నమొత్తాల సేకరణోద్యమం కూడా అనుకున్నంతగా ఫలప్రదం కాలేదు రెండవ ప్రణాళికా కాలంలో సగటున ఏడాదికి నూరేసి కోట్ల రూ ల చొప్పున 500 కోట ధనం సేకరించాలని ఆశించితే, జరిగిందేమిటంటే, 1956-57 లో ఆక్రితం ఏడాదికంటే 5 కోట్ల రూ ల ధనం తక్కువ లభ్యమైంది అంటే 62 కోట్లు మాత్రమే చిన్న మొత్తాల నిల్వలు లభ్యమైనాయి ధరలు పెరిగిపోవడం దీనికొక కారణమై ఉండవచ్చు పరిస్థితి ఇలాఉండగా ఇటీవల కాంగ్రెస్ పక్ష ఆర్థిక, ప్రణాళికా సమష్టిసంఘంలో మాట్లాడుతూ ఆర్థికమంత్రి శ్రీ టి టి కె చిన్న మొత్తాల నిల్వలవలన ఇంకా ఎక్కువధనం సేకరించవచ్చునని ఎలా ఆశించారో దురూహ్యం

మొదటి అంచనాలనుబట్టి, దేశంలోని అభివృద్ధికార్యక్రమాలకు విదేశీసహాయం చాలవరకు లభిస్తుందని ప్రభుత్వం ఆశించింది ఈ ఆశ ఫలించలేదని రిజర్వుబ్యాంక్ నివేదిక పేర్కొంటోంది అంతర్జాతీయ రాజకీయ పరిస్థితి దినికి కారణమని ప్రభుత్వం చెబుతున్నది రిజర్వు బ్యాంకు అభిప్రాయం ప్రకారం విదేశీ పెట్టుబడులు ఈ దేశంలోని ఆర్థిక విధానాల వాతావరణంపై ఆధారపడి వుంటాయి భారత ఆర్థిక విధా

(56-వ పేజీ చూడండి)



మ్యాద్రాస్ మౌంట్‌రోడ్ దృశ్యం —ఫొటో వాసుదేవన్ ]

# బడిపంతులు బ్రాండన్





కథ చదివి పిల్లలను ఉత్సాహపరుస్తున్న బ్రాండన్.

ఐదారేళ్ల బాలబాలికలకు విద్యాబోధన చేయడం బహు కష్టసాధ్యమైన విషయం ఇది ప్రపంచ విద్యావేత్తలందరూ అంగీకరించిందే అందుచేతే పసిపిల్లలకు బోధించడమన్నది సహజ సహనమూర్తులైన స్త్రీలు మాత్రమే చేయవలసిన పనేననికూడా వాదిస్తారు ఇందుకు ఉపాధ్యాయినులనే నియమించడం సర్వసాధారణమైంది వివిధ దేశాలలో ఇంచుమించు అన్ని చిన్న పాఠశాలల్లోనూ ఈ ఆచారాన్నే పాటిస్తున్నారు కిండర్ గార్టెన్ పాఠశాలల్లో అక్కడ పురుషోపాధ్యాయుడుండడం చాలా అరుదు

ఈవిధంగావున్న కొద్దిమంది మొగ ఉపాధ్యాయులలో డిక్ బ్రాండన్ ఒకడు ఇతడు ఓహియో, విశ్వవిద్యాలయ పట్టభద్రుడు 1951 లో డిగ్రీ తీసుకున్నాడు చిన్న బాలబాలికల తరగతులకు బోధించడమంటే బ్రాండన్ కు చిన్నప్పటినుంచీకూడా మహా సరదా పద్నాలుగేళ్ళ వయస్సులో

(5-వ పేజీ చూడండి)



గాజు గిన్నెలో పెంచుతున్న రకరకాల చేపలను చూపుతున్న దృశ్యం.

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము ...అయిదవ భాగము












అని వాడు ప్రాణభీ
తిని పలాయితుడాయె
నని చెప్పి చక్రధా
రిని చూచి భూసురుడు
'తడవాయె నిక నేను
వెడలి పోయెద" నంచు
ఇంటి దారిని బట్టి
ఒంటిగా జనినాడు



...గేయరచన...
నండూరి. రామమోహనరావు ✿ బొమ్మలు.. బాపు






# బంధుప్రేమ

## రాజేంద్ర

రంగమ్మకు ఎవరిదగ్గరా ఒకమాట అనిపించుకోవడం చిన్నప్పటినుంచీ ఇష్టంలేదు. అందువల్లనేకావచ్చు. ఆమె బంధువుల్లో కొంతచెడ్డపేరు తెచ్చుకొన్నది. పొరబాటున ఆమెతో ఎవరైనా హాస్యంగా ఒకమాటంటే, వెంటనే తిట్టడం మొదలుపెట్టేది — "బావున్నావా అత్తయ్యా" అంటే,— "బావుండకేం చచ్చానా" అనేది! అదే, మంచిమూడ్‌లోవుంటే, ఏదోబావున్నానే అని వూరుకునేది. ముఖ్యంగా ఆమెను ఎవరైనా అవమానించాలని ప్రయత్నిస్తేమాత్రం సహించేదికాదు. ఆమె ఒకపనిచేయాలనుకొంటే, చేసితీరేది. ఇకదాన్ని భర్తగానీ, బంధువులుగానీ, శ్రేయోభిలాషులుగానీ ఎవ్వరూ ఆపలేరు. చాలపట్టుదలగల మనిషి.

రంగమ్మ మంచి సంపన్నకుటుంబంలో పుట్టి పెరిగింది. రంగమ్మతండ్రి, ఆమెకు మంచి సంబంధంకోసం చాల గట్టిగా ప్రయత్నించాడు.

వీరరాఘవయ్యది ఆ ప్రక్కగ్రామం. వాళ్ళు మంచిభూములూ, డబ్బూకలిగిన వారు. వీరరాఘవయ్య అప్పటికే సత్ప్రవర్తన కలవాడని పేరుతెచ్చుకొన్నాడు. నిప్పులాంటిపిల్ల రంగమ్మకు అతనే తగినవాడని రంగమ్మ తండ్రి అభిప్రాయపడ్డాడు. అందుకని రంగమ్మను, వీరరాఘవయ్యకిచ్చి పెళ్ళిచేసి, తనబాధ్యత నెరవేర్చుకున్నాడు!

నిజానికి ఆ భార్యాభర్తలమధ్య ఎలాంటి పొరపొచ్చాలూ లేకుండా జీవితం కొనసాగింది. ఆమె అభిమతానికి వ్యతిరేకంగా, భర్తఎప్పుడూ నడచుకోలేదు. అందువల్ల ఆమె ఇతర్లకు తలవొంచవలసినఅవసరం లేకుండాపోయింది.

పుట్టింట్లో తల్లీతండ్రీ వున్నప్పుడు ఆమె తరచు వెళ్ళివస్తూవుండేది. వెళ్ళినప్పుడల్లా పక్షంరోజులయినా వుండేది. వాళ్ళు ఆమెకు, పిల్లలకు, కొత్తబట్టలుపెట్టి తగు లాంఛనాలతో, తిరిగి పంపించేవారు.

తండ్రి బ్రతికుండగానే, పెద్దవాడైన రంగమ్మఅన్న ఆంజనేయులు ఆ యింటి వ్యవహారాలు చూసుకోసాగాడు. ఇనప్పెట్టె తాళంచెవికూడా అతనిచేతికి వచ్చింది.

ఆంజనేయులు, తండ్రిపద్ధతులకు, లక్ష్యాలకు, స్వభావానికిపూర్తిగా భిన్నమైన స్వభావం కలవాడు. కానీ కానీ చేర్చి రూపాయలుచేయడం, అతనికి నచ్చదు. సంపాయించినది, సంపాయించినట్లు ఖర్చుపెట్టి, అందువల్లకలిగే సుఖం, అనుభవించడం మనుష్యధర్మమని అతని నిశ్చితాభిప్రాయం: ఇహలోకంమీద మాత్రమే నమ్మకం కలిగినవాడు. తన 'తరం' వరకే దృష్టిపారించే గుణంకలవాడు. సంపాదన, అనుభవించి, ఆనందించడానికేనని అతను నమ్మడము, ఆచరణలో పెట్టడమేగాక, అందరికీ నచ్చచెప్పడానికూడా ప్రయత్నించే మనిషి. చిన్నప్పట్నించీ, తనను గురించి తప్ప, మరొక జీవినిగురించి ఆలోచించే స్వభావం అతనికి అలవడలేదు. అట్లా అని అతను ఎవరిపట్లా అక్రమంగా ప్రవర్తించలేదు. ఎవరినీ మోసంచేయలేదు.

కూలీలకు, ఇతర పనివాళ్ళకు సక్రమంగా జీతబత్తాలు ఇచ్చేవాడు. తను చేయకపోయినా, భార్య ఏ పుణ్యకార్యంకోసం డబ్బు ఖర్చుపెట్టినా, అడ్డు చెప్పలేదు, చెల్లెలు ఎన్నిసార్లొచ్చినా, భార్య మర్యాదలన్నీ జరిపి పంపుతూనే వుండేది.

తల్లీ తండ్రీ పోయారు: ఆంజనేయులు కొన్నేళ్ళు దర్జాగానే బ్రతికాడు. క్రమంగా ఇంట్లో డబ్బు ఖర్చయిపోయింది. వ్యవసాయం శ్రద్ధగానే చేస్తుండటంవల్ల, కుటుంబనిర్వహణ మామూలుగా నడుస్తోంది. డబ్బులేదనే దిగులుతప్ప ఆ యింట్లో వారికి మరో దిగులులేదు. ఆంజనేయులుకు ఆ దిగులూలేదు. డబ్బుఖర్చుపెట్టేసి నందుకు అతనేమీ విచారించడంలేదు. ఆ డబ్బులో కానీ కూడా దుర్వినియోగం కాలేదని అతని నమ్మకం.

మంచిమేడ కట్టించాడు. అందులో అందరూ, సౌకర్యంగా, హాయిగా బ్రతుకుతున్నారు. ఇంటిచుట్టూ, చెట్లు నాటించాడు, మంచిగాలి వీస్తోంది. గుఱ్ఱమూ, బండీ, కొన్నాడు. ప్రయాణం సుకరంగా సాగుతోంది. వ్యవసాయానికి, కపిలె మానేసి, ఆయిల్ ఇంజన్ పెట్టాడు. వ్యవసాయం సులభంగా జరుగుతోంది.

* * *

రోజులు, మాసాలు గడిచాయి. ఆంజనేయులు కుటుంబం మరికొంత ఐశ్వర్యం కోల్పోయింది.

రంగమ్మను పండుగకు రమ్మని వదినె వచ్చి పిలిచింది. భర్త కూడా వెళ్ళమన్నాడు. ఆమె పండుగకు నాలుగు రోజులుముందే పుట్టింటికి వెళ్ళింది. పండుగ బాగా గడచింది.

ఆంజనేయులుతో భార్య అన్నది—

"ఆమెను రమ్మన్నాం కదా! ఊరికే ఎట్లా పంపించేయడం మంచి చీరయినా ఒకటిపెట్టి, పంపాలి కదా" అని.

ఆంజనేయులు అన్నాడు—

"అదంతా ఏమీకాదు. అప్పుడు మనకంత స్తోమతలేదు ఏ చౌకరకం చీరో తెచ్చిస్తే, ఆవిడ విసిరి నేల కొడ్తుంది! అలాంటప్పుడు నేనేం చెయగలను చెప్పు? నువ్వు అంతా చూస్తూనే వున్నావుకదా! పొలం కూడా రెండెకరాలు అమ్మేయాలని చూస్తున్నాము ఇప్పుడు చేతిలో చిల్లిగవ్వ లేదు. ఈ పరిస్థితిలో మనమేమీ చేయలేము. మరోసారి, మనకు శక్తి కలిగినప్పుడు, రెండు చీరలు...ఇంకా కావలసినవన్నీ యిచ్చి, అన్ని లాంఛనాలతోటీ, పంపిద్దాం."

"అది కాదండీ! మన కష్టాలు మనకు ఎప్పుడూ వుండనే వుంటాయి. ఇంటికొచ్చిన ఆడబడుచుకు ఒక చీరయినా పెట్టి పంపకపోతే ఏం బావుంటుందీ?" అందామె.

"ఎందుకు బావుండదు, చాలా బావుంటుంది! మనం ఇవ్వగలిగినప్పుడు ఇచ్చాము. ఇప్పుడుమనంమంచిపరిస్థితిలో లేము! అయినా మన ఇంట్లో ఎన్నాళ్ళున్నా ఆమెకేమీ లోటు రానీయకు. ఎన్నాళ్ళున్నా సరే, పంచభక్ష్య పరమాన్నాలుచేసి భోజనంపెట్టి అందరూ కలిసి మెలసి హాయిగా వుండండి. బంధుత్వానికి ఇంతకన్నా కావలసిందేముంది." అన్నాడు ఆంజనేయులు.

భర్త స్వభావాన్ని ఎరిగిన 'ఆమె' ఇంకేమీ మాట్లాడలేదు.

పండుగ మరునటి రోజే, రంగమ్మ ఇంటికి బయలు దేరింది. ఆమె బయలుదేరేటప్పుడు ఆంజనేయులు ఇంటిలో లేడు: ఈ

సారి ఆమెనెవరూ చీరలూ, ఇంకేవస్తువులూ చూపించి, ఏది బావుందో చూడమని కోరలేదు.

జట్కా ఇంటిముందు సిద్ధంగా వుంది. ట్రంకుపెట్టె, రెండుబుట్టలు, బండిలో పెట్టారు. ఆబుట్టలోలడ్డూలూ అవీవున్నాయి. ఈ సారి తనకు సరైన మర్యాద జరగలేదని గ్రహించి, గొప్ప అవమానం కలిగింది: అంతా దిగమ్రింగుకుంది: "వస్తానమ్మా వదినా" అని బండెక్కింది:

బండి ఇల్లు చేరుకుంది. ఆమె అంతవరకూ మౌనంగానే వుంది: బండిదిగి, ట్రంకుపెట్టె మాత్రం దింపమంది. బండివాడు బుట్టలు కూడా దించబోయాడు.

"తీసుకుపోవయ్యా! ఈ బుట్టలు మీ దొరగారి ఇంటికి తీసుకుపోయి ఇచ్చేయ్! మేం ముష్టివాళ్ళం కాదు. అవి మాకక్కరలేదు, అని అరిచింది. భర్త అర్థంకాక చూస్తున్నాడు.

"పొమ్మంటే ఇంకా చూస్తూ వూరుకున్నావేమయ్యా. అవన్నీ తీసుకుని...వెళ్ళిపో...పో......"

* * *

అప్పట్నుంచీ రంగమ్మ పుట్టింటికి వెళ్ళడం మానుకొన్నది. వదినె ఒకసారి చెప్పి పంపితే, నానా మాటలూ అని, ఆ మనిషిని తిరిగి పంపించింది. భర్తమాత్రం అంజనేయులుతో స్నేహంగానే వున్నాడు.

* * *

ఏళ్ళు గడిచాయి. రంగమ్మ భర్త చనిపోయాడు. పిల్లలు పెద్దవాళ్లయ్యారు. పెళ్ళిళ్లు జరిగాయి. కుటుంబం పెద్దదయింది. రంగమ్మ దాదాపు ముసలిదయ్యింది.

అంజనేయులు బ్రతికి చెడినవాళ్ళ జాబితాలో చేరేడు. ఇప్పుడాయన అవూళ్లో భాగ్యవంతుడూ కాడు; ఉన్నతుడూ కాడు. పొలాలు చాలవరకు అప్పులపాలయ్యాయి. ఇంట్లో ఖర్చు ఎక్కువైంది. కొడుకులు పెద్దవాళ్లయ్యారు. వాళ్లను మంచి ప్రయోజకులను చేయలేకపోయాడు. ఇద్దరికి పెళ్ళిళ్లు చేశాడు. వాళ్లకు పిల్లలు కలిగారు. కొడుకులు కోడళ్లూ ఎప్పుడూ పోట్లాడుకుంటూ వుంటారు. ఇంట్లో శాంతి నశించింది. అంజనేయులు బాగా మారిపోయాడు: ఉత్సాహం నశించిపోయింది. చప్పగా అయిపోయాడు.

* * *

రంగమ్మ ఆరోగ్యం చెడిపోయింది. అప్పుడప్పుడూ జబ్బు పడుతున్నది.

ఆమె ఒకసారి పెద్ద కొడుకును పిలిచి చెప్పింది: ఇప్పుడతనే ఇంటి పెద్ద.

"పాపం మాఅన్న అంజనేయులు బాగా బ్రతికినవాడు. ఇప్పుడు కష్టాలలో వుంటేనేమి? మా వదినె మహా దొడ్డ యిల్లాలు: అవిడకు నేనంటే చాల అభిమానం. నాకు కోపమొచ్చి వాళ్లింటికి వెళ్ళడం మానేశాను. ఇప్పుడు కడసారిగా ఒకసారి వెళ్ళి అందరినీ చూడాలని వుందిరా! బండి కట్టించరా నాయనా" అని!

"అలాగే" అన్నాడు కొడుకు. అతడు ఆశ్చర్యపోయాడు. ఎన్నో ఏళ్ళ తర్వాత ఆమెకు అన్న కుటుంబంమీద అభిమానం కలగడం, ఆమె అక్కడికి వెళ్తాననడం అతనికేమీ అర్థం కాలేదు. పైగా ఆమెకు ఆరోగ్యం బాగులేదు. తరచూ జ్వరము, దగ్గూ వస్తూ వుంటుంది, రెండురోజుల క్రితం ఆమె పరిస్థితి చాల కష్టమైంది. బ్రతకదనికూడా అనుకొన్నారు. కానీ నిన్నట్నుంచి చాల ఉత్సాహంగా వుంది. ఇంక తేరుకొన్నట్టే లెక్క! బహుశా చచ్చేప్పుడైనా పాత పగలన్నీ మరచిపోయి పుట్టింటివారితో ఒకసారి గడపాలనిపించిందేమో! ఎన్ని జరిగినా బంధుప్రేమ వదలదుకదా అనుకొన్నాడు.

మరుసటిరోజు బండికట్టించి, తల్లిని ప్రయాణం చేశాడు.

చెల్లెలు ఇంటికొస్తుందని తెలిసి అంజనేయులుకు ఆనందమూ, ఆశ్చర్యమూ కలిగాయి.

చాలకాలం తర్వాత ఇంటికొచ్చిన చెల్లెల్ని, ఆయన ఆప్యాయంగా పలకరించి, బాగా మాట్లాడాడు. ఆమెకూడా ఆనందంతో మాట్లాడింది.

రంగమ్మ రెండురోజులు ఇంట్లో పిల్లలతో హాయిగా గడిపింది. వాళ్ళను ఆడించి పాడించింది.

మూడోరోజు హఠాత్తుగా జబ్బుపడింది జ్వరం వచ్చింది, దగ్గు హెచ్చింది! నోటమాట పడిపోయింది. అంజనేయులు ఆ వూళ్లోని వైద్యుణ్ణి పిలిపించాడు. ఆమె అతనిచ్చే మందు పుచ్చుకోకుండా తల ప్రక్కకు త్రిప్పుకొని మూలిగింది.

బంధువులందరూ ఆయింట్లో చేరారు. కొడుకు ఆందోళన పడినాడు. ఆరాత్రి కొంత నెమ్మదించిందనుకొన్నారు.

"ఈ ముసలిది మనింట్లోనే ప్రాణం వదిలేలావుంది నాన్నా! ఎట్లా లేదన్నా, వంద రూపాయలు వదలుతుంది. ఈకష్ట పరిస్థితిలో గోరుచుట్టుమీద రోకలిపోటులా, ఇదొకటొచ్చింది!"

ఈమాటలు ఆరాత్రి రంగమ్మ చెవిలో పడినయ్. ఆమె తృప్తిగా కళ్లుమూసుకొంది!

మరునాడు బంధువుల సమక్షంలో రంగమ్మ ప్రాణాలు పైకెగిరిపోయినయ్. అంజనేయులు, అంతపెద్దవాడు బావురుమని ఏడ్చాడు. ★




విదేశ శిక్షణకు వెళ్లుటకు పూర్వము నాలుగు
వందల యువక ఇంజనీర్లు జమ్‌షెడ్‌పూర్‌లో
ఆరు వారాలపాటు గడిపెదరు
వీరే ప్రభుత్వపు మూడు నూత్న ఉక్కు
కర్మాగారాలను నడపబోయెదరు.

ఈ స్టీల్ నగరములో వీరు భారత
దేశములో ఉక్కు తయారగుటకు
కావలసిన కొన్ని ముఖ్యాంశములను
ప్రత్యేక శిక్షణవలన తెలిసికోగలరు.
నిస్సందేహముగా వీరికి టాటా స్టీల్‌లో వున్న
అనుభవశాలురనుండి స్నేహపూర్వక
సలహాలు కొన్ని లభించగలవు.

ఉక్కు తయారు చేయు యీ భావి నిపుణులకు
స్వాగత మిచ్చుటకు జమ్‌షెడ్‌పూర్
ఎంతయో గర్వించుచున్నది.

**టాటా స్టీల్**

రెండు మిలియన్ల టన్నులవరకు



ది టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ లిమిటెడ్.




## అదిగో భద్రాద్రి

6

"అయితే ఇది కలా? ఇలా?" అని గొణుక్కున్నాడు వరహాలరాజు గూర్ఖా వ్యాఖ్యానాన్ని బాధగా పీకుతున్న దవడలతో నెమరు వేస్తూ. అతని చేతిలో రూపాయనోటు అమాయకంగా, రెపరెపలాడుతోంది.

'కలా ఇలా' అన్నాడు రాజా ఇంకోసారి.

"రెండూ కాదు. అలా వలా తలా ను. గేటు తీశారుగాని కొస్త తప్పుకోండి మేష్టారూ" అన్నాడు ఎవరో.

రాజా వెనక్కి తిరిగి చూశాడు. చూసి ఉలిక్కిపడ్డాడు 'హలో సార్. ..చిన్న సందేహం అండి. కొస్త ఇపింటారండి" అన్నాడు వినయంగా.

ఆయన తెల్లబోయి అలాగే అని ఓ పక్కకి వచ్చాడు.

"మేష్టారూ ఒకటి కాదండి. రెండున్నాయండి.

"సరే చెప్పండి"

"ఈ రూపాయనోటు నాదేనా?" అన్నాడు రాజా ఆ రూపాయి చూపించి.

"మీ చేతిలో ఉంది కాబట్టి మీదే అయి ఉంటుంది."

"ఇందాకళ ఇక్కడ ఆశ్చర్యపడ్డ గూర్ఖా గారు ఒకరు ఉండాలి. వారి చేతిలో రూపాయి నోటు ఎవరిది?"

"వారిదే కాబోలు... మేష్టారూ ఏమిటిది? మీరు పొద్దున్నించీ ఏం పుచ్చుకోలేదా? లేపోతే కాస్త కాఫీ ఎక్కువైందా? మరోలా అనుకోపోతే 'తీర్థం'గినా పుచ్చుకున్నారా?... ఏమిటి మీరడిగేది? నాకు పనుంది వస్తా" అన్నాడు ఆయన అక్కడే నిల్చుని.

రాజా సిగ్గుపడుతూ తలవంచుకున్నాడు. "అది కాదండి. మీరు మంచివారిలా ఉన్నారు. నేను కొత్తవాడినిరెండి నా కంతా తికమకగా ఉంది. పోనీ ఇంకోటి చెప్పండి. మీరిందాకళ చూపుడు వేలు ముందరికి పెట్టారా?" అన్నాడు.

"ఏమో గుర్తు లేదు."

"పెట్టారు సార్. గుర్తుచేసుకోండి. అసలు ఇంకోటి చెప్పండి చెబుతా. మీరూ దిలీప్ కుమారూ ఒకే గదిలో ఉన్నప్పుడు ఎన్ని కంచాలలో తినేవారు? ఎన్ని మంచాలమీద పడుకునేవారు?"

ఎదటాయనకి మతిపోయింది. కొంచెం ఆగమన్నాడు "నేనూ దిలీప్ కుమారూ ఒక గదిలో ఎందుకుంటామండి. ఉంటేటంత స్నేహితుల మేం అయితే, ఒక్క కంచంలో

ఎస్. పార్థసారధి

ఖచ్చితంగా తింటాము. రెండేసి ఉన్నా చెరోపూటా వాడేవాళ్ళం" అన్నాడు హుషారు తెచ్చుకుని.

రాజాకి ఉత్సాహం పెల్లుబికింది. కల సంగతి తెలిసిపోతోంది.

"రైటో సార్. అదే కావాలి. అదే అడిగాను. ఇంకొక్కటి చెప్పండి. మీ పేరు రామనాథమా-థనా?" అన్నాడు.

ఎదుటాయన పకపక నవ్వాడు. "పోరిపిడుగా. ఎలా కనిపెట్టావు?" నా పేరు రెండూను. టమిల్ కంపెనీలో అయితే రామనాథన్, తెలుగు కంపెనీలో అయితే—"

"నిజమే?" అన్నాడు రాజా కొయ్యబారిపోయి "అయితే ఇందాకటిది కల కాదన్న మాట. నేను మూర్ఛపోలేదన్న మాట. ఈ రూపాయి నాదే నన్నమాట. గూర్ఖా చేతిలోంచే తీసుకున్నా నన్నమాట. మీరు చూపుడు వేలు ముందుకు పెట్టారన్నమాట. రైటేనా?" అన్నాడు రాజా గుక్కతిప్పుకోకుండా.

"కొన్ని రైట్లూ కొన్ని తప్పులూ కొన్ని నాకు తెలీదు. మీరు గూర్ఖా చేతిలో రూపాయిపెట్టి పరుగెత్తి మళ్ళీ లాక్కున్నారా; వాడు కాస్త బెదిరిపోయాడు. మీకు వేపకాయంత వెర్రి ఉందని. కరుస్తారని భయపడి కాబోలు, లాగి లెంపకాయకొట్టాడు. ఆ దెబ్బకి మళ్ళీ మీరు అర్జెంటుగా రైలుగేటు దగ్గర కెళ్ళి జేరబడ్డారు. నేను ఇది చూసి మీ దగ్గరకు వచ్చేసరికి అలా వలా తలా అంటున్నారు. నాకింకా అనుమానంగానే ఉంది." వెళ్ళొస్తా అన్నాడు రామనాథన్.

అంతలోకే గేటు మూసేశారు.

రాజా రామనాథన్ చొక్కా పట్టుకున్నాడు. "క్షమించండి మేష్టారూ గేటుకి దారిచెప్పి వెళ్లండి" అన్నాడు.

ఏ గేటు?

"అదే..."

"ఓ. మీ పేరు?"

"వి. రాజా...మీది?"

"రామనాథ్. టమిల్ కంపెనీలో థన్, తెలుగు చోట థం." అన్నాడు రామనాథ నాథం నవ్వుతూ.

ఆ నవ్వు చూస్తే రాజాకి ఆరోజా టెంటు సినిమాలోంచి ఊడిపోయిన నటుడు జ్ఞాపకం వచ్చాడు.

"మేష్టారూ ఇంకొక్క సందేహం. మీరెప్పుడైనా మొవ్వారం టెంటు సినిమాలోంచి ఊడిపోయారా?" అన్నాడు జంకుతూ.

రామనాథం ఉలికిపడి వింతగా చూశాడు రాజావంక. ఒక క్షణం ఆగి కొంచెం అవతల ఉన్న కొట్టుకువెళ్ళి సోడా ఒక కొట్టి పట్టుకొచ్చి ఇచ్చి "ఇది పుచ్చుకో ముందర. ఆనక మాట్లాడదాం అన్నాడు గంభీరంగా.

# విక్రమార్కుడి మార్కు సింహాసనం

పెద్ద సంబరంలో తప్పిపోయిన పసి పిల్లాడిలా అయిపోయాడు రాజు. అమ్మమ్మ, ముత్యం, వాళ్ళంతా గుర్తొచ్చారు. గబగబ సోడా తాగేసి, భేవుమని త్రేన్చి బాధను విడిచేశాడు కూలబడి.

## గేటు కాపరి కథ

రామనాథంగారు రాజుని ఓదార్చే వరకి గేటు మూడుసార్లు మూసి నాలుగు సారు తెరిచారు.

రాజు కథ విన్నాక రామనాథంగారికి జాలివేసింది.

“అయితే గేటు అంటే అంతభయం అన్నమాట. గేటుదాటడంకోసం స్టూడియోకి రూపాయిద్దామనుకున్నావా? ఏంలాభం బాబూ” అన్నాడాయన.

ఏ లాభం లేదని ఆయనే జవాబూ చెప్పాడు.

“ఆ స్టూడియో గేటు దాటడం మాటలో పనికాదు రాజూ. పిడికెడు డబ్బు ఇచ్చి దాటడం ఓ దాటడమా, దానివల్ల ఏంలాభం లేదు. నిజంగా ఆ గేటు దాటడానికి ముందర ఎన్నో గేట్లు ఎన్నోసార్లు దాటాలి. సినిమా పరిశ్రమలో పెద్దస్టార్ల మావయ్యలూ బావమరుదులూ, బాబాయిలూ బంగారు బొమ్మలాంటి అమ్మాయిలూ లేకపోతే ఇదేరాదు అనుకో. కాని దీనికెంతో ఓర్పు కావాలి. చాలా నేర్పు కావాలి. మజాకా కాదు.

ఓకథ చెబుతాను విను... నాకిన్నీ గేటు కేగా నువ్వెళ్ళేది. నేనూ అంతేలే, కబుర్లు చెప్పుకుంటూ పోదాం. కాస్త చురుగ్గా అడుగెయ్యి.

పూర్వకాలంలో నేనూ దిలీప్‌కుమారూ కలిసి ఓగదిలో ఉండేవప్పుడు—ఎప్పుడూ లేదనుకో— నేను బొంబాయిలో లాంట్రీ కొట్టేవాణ్ణి. లాంట్రీ అన్నమాటకి టీకా తాత్పర్యాలు నీ జేబులో డబ్బులయిపోయాక తెలుస్తాయిలే. తొందర్లేదు. ఏం? అప్పుడు లాలా అని ఓ ఫ్రెండు ఉండేవాడు. వాడు నాకు గురువనుకో అప్పుడు... అతను నీలాగే ముందర స్టూడియోకి వెళ్ళబ్బులు పారేసి స్టూడియోలో పాగా వేద్దామని ఆశపడ్డాడు. కాని, కలిసిరాలేదు. అసలు నీవంటి ఏ-దేవుడో వాడిమీద జాలిపడి ఎన్ని గేట్లుదాటాక స్టూడియోకి రావాలో చెప్పాడు. ఎక్స్ట్రావేషాలయితే సరేసరి అనుకో, మరి కొత్తగావచ్చినపుడు హీరో రోలుకి హీనపక్షం ఏదీ గిట్టదు గదా.

సరే లాలా గేట్లదండయాత్ర ఆరంభించాడు.

రోజూ పొద్దున్నే ఒక ప్రొడ్యూసరుగారి గేటుదాటివెళ్ళి దండం పెట్టి, చివాట్లు ఫలహారంచేసి వచ్చేవాడు. అక్కడినించి, ఒక (గేట్) డైరెక్టరు ఇంటికి వెళ్ళేవాడు. వాళ్ళది చిన్నగుమ్మం అనుకో. అయితేనేంగాక, అని, అదే ఓ గేటు అనుకుని దాటి, మాటలు పడి తిరిగివచ్చేవాడు. ఆనక ఒక డాన్సు డైరెక్టరు ఇంటికి వెళ్ళి ఆయనతో కలసి ఇవతలకొచ్చి చాయ్ ఇప్పించి సాగనంపి, మళ్ళీ డ్యూటీమీద పోయేవాడు. ఒంటిగంటకి పెద్దపెద్ద హీరోలు హీరోయినులు భోజనాలకు ఇళ్ళకు వస్తారు. ఆ వేళకి ఒకరి ఇంటికెళ్ళి వరండాలో నిల్చుని మీడియం షాట్ దూరంలోంచి వారికి దండం పెట్టి చరితార్థుడయేవాడు. మధ్యాహ్నం, హీరో చిరునవ్వుకో, తల తాటింపుకో అర్థం, భావం అంటకట్టి కమ్మగా కలలుకని, అవే తిని పడుకుని లేచి మళ్ళీ రెండో షిఫ్టు మొదలెట్టేవాడు. ఈ షిఫ్టులో టెక్నీషియన్ల ఇంటి గేట్లను పవిత్రం చేసేవాడు. డైరెక్టరు దగ్గిర్నించి లైటుబోయిదాకా ఏదన్నా సరేనన్న స్థితికి వచ్చాడనుకో.

“కాస్త కాలంపోనిస్తే చాలు అక్కణ్ణించి అలా అలా పైకి పాకేస్తాను” అని వాడు ధైర్యంగా.

అందుకనే వాడంటే అందరికీ భయం అనుకో. వాడు అలాగే అనేవాడు. నేనూ అంతేలే. ఆ భయం కొద్దీ ఛాన్సులు రాకుండా చేసేస్తారు.

ఉత్త అసూయ అనుకో. వేషానికి మూడు వేలుచ్చుకునే వాళ్ళు కాస్తా వీడెక్కడ చేరిపోతాడో అని, ముప్పావలాకే ఒప్పేసుకునే వారంటే నమ్ము. నేను నమ్ముతానులే.

ఏం? ఇంక సాయంత్రం మళ్ళీ ప్రొడ్యూసర్ల దర్శనం చేసేవాడు.

ఇలా గేట్లుదాటగా దాటగా దాటగా కొన్నాళ్ళకి, ఒకాయనకి జాలికలిగింది.

‘బేటా! బాత్ క్యా హై’ అన్నాడు.

‘బాత్ యే హైకీ’ అంటూ లాలా తన కథ చెప్పుకొచ్చాడు.

పదిరూపాయలు తెమ్ము, తో సిఫార్సుగా ఇస్తా అన్నాడాయన జాలిగా.

లాలా పరుగెత్తుకుని నాదగ్గరకొచ్చి దుంపతెంచేసి, పదీ పట్టించాడు. ఎప్పుడూ నాకూ ఆశ పుట్టింది. పది పోతేపోయిందిగాని, హీరో ఛాన్సు ఎందుకు వదులుకోవాలని నేనూ ఓపది పట్టుకువెళ్ళి. ఆ వెధవ మా ఇద్దరిచేతా అడ్డమైన గేలాగులూ అనిపించి రెండు పదులూ పుచ్చుకుని రేపు రమ్మన్నాడు.

అంతేనయ్యా.

‘కల్ జావ్ బేటా’ అన్నాడు. వాడికళ్ళు తగలెయ్యా. వది కల్లముందా కొడుకు. ఆ రేపు రేపే. ఎన్ని రేపులు వాడిదిక్కుమాలిన గేటు దాటామో తెలీదు. ఓ రోజున, వాడి ఖర్మం కాలి దొరికాడు.

‘క్యాబేటా తుం ఆగయా?’ అన్నాడు సాదాగా నవ్వుతూ.

‘నీ బేటా సిగతరగ, దొంగ నాయాలా’, అంటూ లేచి తన్నబోయాడు లాలా.

సరే నానాగోలా అయ్యాక వాడు, ‘మీ ఓపిక పరీక్షించాను’ అంటూ మురిసిపోయి బతికిన శవంలా నవ్వి రెండు ఉత్తరాలూ రాసిచ్చాడు.

సరే ఇద్దరం ఒక్క దగ్గరకే ఎందుకని, లాలా ఓ పెడకీ, నేనో పెడకీ పోయాం.

వాడి ఉత్తరాలు తెగలెయ్యా. అవి చూడగానే గేటులలో ఉన్న ప్రతివెధవా అవి చూసి నవ్వడమే. అది విన్నాక అప్పుడు గేటులో లేని వెధవాయిలు కూడా పగలబడి నవ్వారు.

‘గర్మాగరం ధోఖా ఖాయా క్యా భయ్యా’ అన్నారు వాళ్ళు.

మాకు ఉత్తరాలిచ్చిన గడ్డపువెధవకి ఇదే వృత్తిట. ఇలా సిఫార్సులు ఇస్తూ డబ్బు సంపాదిస్తున్నాడుట. వాడి ఊహాకూడా మంచిదేననుకో. ఇలా పోగేసిన డబ్బుతో ఓ సినిమా తీసి, అప్పుడేమో తనదగ్గిర టోకరా తిన్న వెధవలందరికీ హీరో రోల్సు ఇచ్చి ఉద్ధరిస్తాడుట. అయితేమటుకు?

నేను ఓపిక విడిచి ఊరుకున్నాగాని, లాలా దాని అంతు కనుక్కుంటానన్నాడు.

వాడు పంతం అలాగే గేట్లు దాటిదాటి, చివరకి స్టూడియో గేటులో జూనియర్ గుమాస్తాగిరీ సంపాదించాడు. అక్కడినించి మెల్లిగా స్టూడియోలోకి ఎలాగో జారుకుంటే అప్పైన అలా అలా పైకి పాకేస్తాడుట. నేను ఇటు వచ్చేశాననుకో. వాడింకా అందం బట్టే ఉన్నాడు.

వీడు రోజూ ఎవర్నో ఒకరికిందా అంటే ‘అద్దిగో భద్రాద్రి! టూ మంత్స్‌లో దొరుకుతుంది’ అంటాడు. అవి పుట్టి ఎంపమాపులని నానమ్మకం. నువ్వూ అలాగే అనుకో. అయినా వాడి ఓర్పువల్ల అనంతరం ఎప్పటికో మహానటుడో ఇంకోడో అయిపోతాడు. అప్పుడు ఫిలిం పేజీలలో రాసుకోవచ్చు. వెండితెరకి వచ్చేదాకా గేటులలో బీటు కాసిన మహా ఘనాపాఠీడు అలాని.

బాబూ నీకు అంత పట్టుదల, ఓపిక ఉన్నాయా? అన్నాడు రామనాథం కథ ముగించి.

‘చాలాకష్టం అనుకుంటాను’ అన్నాడు రాజు నానుస్తూ.

‘అయితే లాభం లేదబ్బాయీ’ అన్నాడు

( 55వ పేజీ చూడండి)

# "తప్పించుకు తిరుగువాడు"

## అవసరాల రామకృష్ణారావు

'ఏమండీ, ఏమండోయ్' అంది సీత మొగుడి వెనకాలే గదిలోకి వస్తూ.

'ఎందుకండోయ్!' అన్నాడు రమణ నవ్వుతూ.

'అంత వెటకారంగా ఉంటే నే చెప్పనే చెప్పను.'

'అంత పెంకితనంగా ఉంటే నే విననే వినను.'

'అంతే నన్న మాట?' అని సీత అదోలా మొహం పెట్టి, వెళ్ళిపోతున్నట్టు నటిస్తున్న మొగుడి కాళ్ళకు బ్రేకులు వేసింది కళ్ళతో.

'అది కాదె సీతా, యింకా షేవ్ చేసుకుని, నీళ్ళోసుకుని, డ్రెస్ చేసుకుని క్రికెట్ మ్యాచ్‌కి వెళ్లాలి తెలుసా?'

'పాతికేళ్ళు పైబడినా అటు యింటి పెత్తనం పైబడక—యిటు పిల్లలకీ లోబడక కుర్రాడిలా ఆటలా? ఏం వాటంగా ఉంది పాటూ? అడిగేవాడు లేకగాని'

'లేకేం? నా నాటకంలో నాయకురాలివి నువ్వున్నావ్‌గా! నీకు మాత్రం బాధ్యత ఏమంటేందిగనక? ఇంత పూర్వకాలపు వంశంలోనూ సినిమాలనీ, షికార్లనీ, కబుర్లనీ, క్లబ్బులనీ—ఎడపిల్లా, చేతిపిల్లా ఎడా పెడా ఏడుస్తూంటే ఎక్కడికి పోనో యీ కబుర్లు? తొందరపడ్డవాడికీ ముందు చూపు ఉన్నవాడికీ అదే తేడా! ప్లానింగ్ మేడమ్, అంతా ప్లానింగ్!'

మధ్యతరగతి కుటుంబంలోని మానవుడై పుట్టి—పరిస్థితుల్నీ పరిసరాల్నీ పరీక్షించి, సమీక్షించి, ఆలోచించి ఆచరణలో పెట్టి, ఎన్నాళ్ళు గడిచినా 'శోభనం పెళ్ళికొడుకు'లా కబుర్లు చెబుతున్న భర్తను చూసేసరికి సీతకి జన్మ తరించినట్లయింది. అంతకన్న ఉన్నత స్థానం తెలివైన ఏ స్త్రీ కోరుతుంది? భర్తకి దగ్గరగా వచ్చి అతని గుండీలు సవరించడం ప్రారంభించింది.

'నిజమే—తెలివి ఉండగానే సరిగాదు—దాన్ని తెలివిగా ఉపయోగించుకోడంలోనే ఉంది తెలివి. అది సరే, నా మాటేం చెప్పేరు?'

'నీ మాటేమిటో నువ్వు చెప్పండే!'

సీత అదేమిటో చెప్పేలోగా అత్తగారు అక్కడికి రానేవచ్చింది.

సుబ్బమ్మ గుమ్మందగ్గిరే నిలబడి పోయింది.

'ఎవరదీ, అమ్మా? రా, ఇలా లోపలికి.'

'అబ్బె ఏదో కబుర్లు చెప్పుకుంటున్నారూ, మధ్య నే నెందుకనీ!'

'మామూలు కబుర్లే. రా'

సుబ్బమ్మ లోపలికి వచ్చి కూర్చుంది. తల్లీ కొడుకూ ఉన్నప్పుడు తను మధ్య ఉండకూడదని ఆ 'తనుమధ్య'కు తెలుసు. ఇంకా లేచి వెళిపోదా మనుకొంటూండగా అత్తగారు అననే అంది.

'సీతా, తోటకూర కడిగి అరుగుమీద పెట్టేను తరిగేసి పొయ్యిమీద పడెయ్యి. ఓ పది వడియాల్లా తీసి వేయించు. రెండు పొట్టువడియాలు కూడా వేయించు రమణకి యిష్టం' ఈ మాట పూర్తయేసరికి సీత అక్కడ లేదు.

'ఏమిట్రా నీ పెళ్లాం నీతో అంటోంది?'

'ఏం లేదమ్మా.'

'చాల్లేరా, పప్పుగిన్నె అలా వంచేసి పరుగెత్తుకొచ్చింది, అర గంటయింది. నే చూసే దనుకున్నావా?... పుట్టింటికి వెడతాననేనా?' రమణ మాటాడలేదు.

'వేరింటి కాపురం పెడితే వేడుకగా వెలిగించేదేమో! అన్నిటికీ కంటకంగా ముసలి ముండని నేనొకర్తిని తగులడ్డాను మరి!... అభిమానం నీకుండొచ్చు, దాని కుండొద్దూ? అమ్మ కొట్టినా రుచిగానే ఉంటుంది, అత్త పెట్టినా పనికిరాదు మరి. ఇంతకీ అదేమందో చెబుదూ!'

'నాతో ఏమీ అనలేదమ్మా, సంగతేమిటో చెప్పు, కనుక్కొని చివాట్లు పెడతాను.'

సుబ్బమ్మ అటువైపు చూసి వచ్చి మళ్ళీ మొదలెట్టింది.

'ఏం లేదురా, మొన్నటికి మొన్న నాలుగు నెలలయిందో లేదో తమ్ముడిపెళ్లాం నీళ్లాడిందని తనెళ్లి పదిహేనురోజులు ఉండొచ్చిందా, వినాయకచవితి ఏమంత పెద్ద పండుగని చెప్పు?..'

రమణ సుబ్బమ్మ మొహంవైపు చూశాడు. 'అందులో 'కోడలు పుట్టింటికి వెళ్ళి సుఖపడిపోతుందేమో' అన్న అసూయతో కూడిన ఆత్రుతకంటే మించిన.. అన్నిటినీ అధిగ



పేరంటం
—వేమూరి లక్ష్మి, న్యూఢిల్లీ.]

# తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ!

పించిన... అతి చక్కని నిశ్చయం కనబడి అతని మనసు సుగంధం వ్యాపించిన పువ్వులతోట అయింది.

తల్లి పిల్లని కొడుతుంది, ద్వేషమా?

తల్లి కొడుకుని తిడుతుంది, అసూయా?!

తనచెల్లెలు అత్తారింటికి వెళ్ళేనాడు అమ్మ కళ్ళనిండా నీళ్ళు పెట్టుకుంది. అని మళ్ళీ సీత అత్తారింటికి వచ్చినప్పుడే నిశ్చింతగా ఉంటుంది.

అమ్మ అర్థంకాని చిట్టమ విధి. ఆ కాలపు అమ్మలక్కల ప్రతినిధి. అయితే? అభిమానానికి పెన్నిధి కాదా!

సీత ఆ మధ్య విశాలాక్షి కొడుక్కి పుట్టిన రోజయితే, పేరంటానికి వెళ్ళింది, చీకటి పడినా యింటికి రాలేదు.

'ఈ కాలపు వాళ్ళతో పడలేం బాబూ, పక్క అమ్మ అంతదూరం అంటే ఒక్కర్తీ నడిచి వెళ్ళింది, చీకటిరాత్రుల్లో కూడాను.'...

నాటకాలు వేయించే రవణకి చిన్న నాటకం ఆడాలనిపించింది.

మొన్నటికి మొన్న...యింకా ఎనిమిదేళ్ళా కాలేదు. పాల సూరమ్మ కూతురు వర్షంలోటే అడ్డుబడి చెవిపోగులు తెంపుకున్నారట...'

'...అయ్యో అయ్యో వెళ్ళరా బాబూ, వెళ్ళి తీసుకురారా!'

'నాకేం! నేనేం తీసుకురాను! చిన్నదా, చితకదా! అంతమాట వినకపోవడమేం? ఇది కాకపోతే మరోకర్తి...నే చస్తే వెళ్ళను'

సుబ్బమ్మ యీ చివరి మాటలు వినిపించుకోలేదు... ఇంట్లోకివెళ్ళి అయిదు నిమిషాల్లో బట్ట మార్చుకుని చేత్తో లాంతరుతో సిద్ధమైంది.

'చూడొరే రవణా, నన్నెవరూ ఏం చెయ్యరుగదా, యిప్పుడే వస్తా యిల్లు జాగ్రత్త.'

'అదేమిటే అమ్మా, ఎక్కడికి?'

'ఇంకెక్కడికి? నీ కింతకన్నా పెంకి పెళ్ళాం రావచ్చుగాని, నా కింతకన్న కొంటె కోడలు రాదుగా? అప్పుడనగా వస్తానంది, ఏమైందో పెద్దపిల్ల...' తల్లి బయ్యోళ్లు తీరించేటట్టు దీవించమని రవణ దేవుణ్ణి ప్రార్థించాడు. సైకిలుమీద వెంటనే బయలుదేరి విశాలాక్షిగారింటి కొచ్చేసరికి సీత చాలా సేపై వెళిపోయిందన్నారు. వాడలిపోయా యింటికొచ్చేడు.

'ఏంరా, నీ పెళ్ళాం ఏదీ?' అని అడిగింది గుమ్మంలోనే సుబ్బమ్మ.

రవణ అప్రయత్నంగా ఆకాశాన్నంటింది. ఆ గాభరామూని సుబ్బమ్మ వెనక దాక్కున్న సీత నవ్వకుండా ఉండలేకపోయింది.

'రాలేదా అని మా రాజ్యంగారింటికి వెళ్ళొచ్చానండీ, అంతలోనే అంతయిందా!' సుబ్బమ్మ ఊరుకోలేదు.

'అంతలో అలకలు, అంతలో పులకలు! కలికాలపు చిలకలు! నాకెందుకమ్మా, భోజనానికి లేవండి ముక్కలు చల్లారి పోతున్నాయి.'

* * *

'ఏమిరా, ఏమిటంత ఆలోచన, ఏమంటావ్?' అని అడిగింది సుబ్బమ్మ.

'నీమాటొకటీ నామాటొకటీనా అమ్మా! అయినా నువ్వు చెప్పిన దాన్లో తప్పు లేదు గనకనా! మాటాడితే యీ ప్రయాణాలేమిటీ మంచీ చెడ్డా లేకుండాను! నేను ఒక్కనాటికి పంపను తెలుసా?'

'మా నాన్నే! మా బాబే!!' అనుకుంది ఆనందంగా సుబ్బమ్మ.

'నా మొగుడే! రాక్షసుడే!!' అనుకుంది తాత్కాలికంగా ఆమాటలువిన్న సీత.

* * *

'అత్తగారు నన్ను విడిచిపెట్టలేక వెళ్ళొద్దంటున్నారని నాకు తెలుసు. కాని ఎన్నిసార్లు చెప్పినా ఆవిడ వినిపించుకోడం లేదు. నేనేంచెయ్యను! ఈ వినాయక చవితికి మా నాన్నకి అరవై నిండుతాయి. షష్టిపూర్తి కూడా చేసేద్దామని అనుకుంటున్నామనీ, మరీమరీ రమ్మనీ కబురుపంపేరు. ఈసారి ఎక్కడెక్కడివాళ్ళూ వస్తారు. బొంబాయి నుంచి మా పెద్దన్నయ్యకూడా వస్తాట్ట. వాణ్ణిచూసి ఎన్నేళ్ళోఅయింది. ఆడదాన్ని, చూడకుండా ఎలా ఉండగలను చెప్పండి?'

రవణ అన్నీ సావకాశంగా విన్నాడు.

'ఇవన్నీ అమ్మతో చెప్పేవా?'

'అమ్మా, అన్నీ చెప్పేను—ఆవిడవల్ల

నామాట వినిపించుకుంటేనా? చూడండి. నామాటే వినమని మిమ్మల్నెప్పుడూ నిర్బంధించలేదు. మీకు ఏదిన్యాయమనితోస్తే అలా చెయ్యండి.'

ఆడుతూ పాడుతూ హాయిగా దినాలు గడిపే రమణ యింత యిరుకునపడతాడని కలలోకూడా అనుకోలేదు. అతను లా మౌనంగా ఉండిపోడం — అందులో అర్ధాంగీకారం ఆ అర్ధాంగికి—అర్ధాంగీకరిస్తే పూర్ణాంగికి—ఏమీనచ్చలేదు.

'నా మొగుడు నామాటే ఆడతాడనే సంతోషం అటుంచి—ఉన్నమాట గట్టిగా చెప్పతారనే ధైర్యంకూడా పోతోంది— పోనీండి ఏడుస్తూ యిక్కడే ఉంటాను, మీ అమ్మగారిమాట జరపడమేగా మీకు కావలసింది?'

రమణ ఆశ్చర్యంగా సీతవైపు చూశాడు. ఎంతగంభీరమైన స్వభావంవున్న వాళ్లయినా ఆడాళ్లు ఎంతత్వరగా తేలిపోతారు! ఎటూ చెప్పలేని దురవస్థలో రమణ కొట్టుకు పోతూండగా వీధిగుమ్మంలో బండిఆగింది. సీత కిటికీలోంచి చూసింది.

సుందరమ్మొదిన! ఈవిడొకం పనీ పాటూ లేదు—ఈ వేళప్పుడు ఎందుకొచ్చినట్లో!'

సుందరమ్మ రమణకి దూరపు చుట్టం—వరసకి అక్క అవుతుంది. బాగా ఆస్తి ఉన్న వింతంతువు. ఎవర్నీ పెంచుకోదు. వాళ్ళ కీ వీళ్ళకీ ముళ్ళు పెట్టిరోజులు వెళ్ళబుచ్చుతూంటుంది. ఎక్కడైనా కాస్త చల్లగా సంసారం సాగుతోందంటే అక్కడికి బండికట్టించేస్తుంది.

'అత్తగా రసలే అమాయకురాలు—ఈవిడేం పుల్ల పెడుతుందో!' అంది సీత భయంగా.

'సరిగ్గా సమయానికి వొచ్చింది. మునిగిపోతున్న వాడు పడవలా దొరికింది. సుందరమ్మక్కయ్యా, నువ్వు నెయ్యేళ్లు బతకాలి! అన్నాడు రమణ. సీత మొగుడి మొహంకేసి అతి ఆశ్చర్యంగా చూసింది. రమణ సీతకి జరిగింది జరగవలసింది బోధపరచి కష్టపడి ఒప్పించాడు.

*   *   *

రమణ పొద్దుటేలేచి ఆఫీసులో అర్జంటు పనుందని—మధ్యాహ్నం భోజనం పంపించమని—సాయంకాలం వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

ఏడుగంటలయింది, సీత యింకా లేవలేదు.

'ఆశ్చర్యం! సీత్తా, పొద్దెక్కిందే యింకా కోడలు లేవలేదూ?' అని బుగ్గలు నొక్కుకుంది సుందరమ్మ.

'లేస్తుంది లేవే, లేచేం చెయ్యాలి? ఇంకా చిన్నతనం...' అని వర్దబోయింది. కుబ్బమ్మ.

'ఏం పత్తికాలమే నా తల్లీ...యింకా నీ కోడలు చిన్నపిల్లా? ఈ యీడ్లకే నీ ఉగ్గు పట్టకపోయావా? అవ్వ! ఇది మా రాముడు యీడుది, ఇరవై దాటింది. ఈ పాటికి నలుగురు పిల్లలు పుట్టవలసిన మాట. నువ్వయితే యిలా ఊరుకున్నావ్ గానీ నేనయితే యీ గొడ్డుమోతుని గుమ్మంలో లేకుండా కొట్టి కొట్టి పంపే దాన్ని.'

# తప్పించుకు తిరుగువాడు ధన్యుడుసుమతీ!

గదిలోంచి యీ మాటలు వింటున్న సీతకి సుందరమ్మ అక్క సుభద్రయ్యమ్మ మాట జ్ఞాపకం వచ్చి నవ్వొచ్చింది.

ఆవిడ కోడలు కడుపుతో ఉంటే నొప్పులు వచ్చే దాకా చాకిరీ చేయించింది. నొప్పు లొస్తూంటే రిక్షా ఎక్కించి పుట్టింటికి దిగ బెట్టించింది. పాపం కోడలుకి ఆడపిల్ల పుట్టిపోయింది. ఈ కబురు చెప్పడానికి వియ్యంకుడొస్తే ఆమె ఏమన్నదో తెలుసా?

'చాలు చాల్లేవయ్యా నువ్వు వచ్చి, నేను వచ్చి, మంత్రసాని వచ్చి ఆడపిల్లనంటే కన్నావని మనవరాలు నచ్చిం-ది మొహం పెట్టుకు వచ్చావ్ చెప్పడానికి? ఇక్కడుండనుంటేఉందా! ఇక్కడేఉంటే వనసంతు లాంటి మొగపిల్లాడు పుట్టడూ?

ఆ సుభద్రయ్యమ్మ చెల్లెలే ఈ సుందరమ్మ!

సీత గదిలోంచి యివతలి కొచ్చింది.

'ఎప్పుడొచ్చావ్ వదినా?...' అని ఆప్యాయంగా పలకరించి మొగుడి మాట జ్ఞాపకం వచ్చి మొహం చిట్లించి!... అయినా నువ్వు ఎప్పుడొస్తే నాకేంలే అని అవతలకి వెళ్ళిపోయింది.

'చూశావా, చూశావా ఎంతపొగరో! 'అయినా ఎంత వెర్రిదానివి పిన్నీ నువ్వు! జోడెద్దుకు పోట్లు మప్పుతావు! ఎలా తయారయింది, నేనిప్పుడు వస్తే తినకమిటేటి!-- నాలాంటి దిక్కులేంది ఒకచోటికి రాడమే తప్పులే. నీ కోడలు బాగానే చెప్పుదెబ్బలు కొట్టిందిలే సుబ్బమ్మ పిన్నీ! ఇక జన్మలో రాను. నీకోడలి పెద్దరికి వెయ్యివేల నమస్కారాలు, పోతున్నాను...'

కళ్ళనీళ్ళెట్టుకుని సుందరమ్మ లేచి నిలబడింది.

'అదేమిటే సుందరమ్మా, మా మాట... మాటకి అంతగొడవ చేస్తావ్. ఉండు నే కనుక్కుంటాను -- అప్పుడే అమ్మాయీ ఏమిటే ఆగడం? ఇంటికొచ్చిన మనిషిని అలాగేనా ఆదరించడం?'

'అవును తియ్యా పొరపాటయిపోయింది.' ...అని నేనంటానని మా ఉద్దేశం కాబోలు ఇది నాయిల్లు, నాయిష్టం...నాయింటి కొచ్చిన వాళ్ళని ఎలా ఆదరించాలో నాకొకరు చెప్పనక్కర్లేదు.

సుబ్బమ్మ త్రాన్నడిపోయింది. ఈ మాటలు సీత అన్నదేనా!

'లాభం లేదు -- ఇహ లాభం లేదు సుబ్బమ్మ పిన్నీ... ఇంకొన్నేళ్ళుంటే నీ కోడలు నన్ను కొడుతుంది కూడాను...'

'ఆగు...ఉవ్వాగు సుందరమ్మా! అప్పుడే సీతా యివాళ యిలా చిత్రంగా మాట్లాడుతున్నావ్ ఏమొచ్చిందినీకు? ఈ యిల్లు నీదా? 'అయితే మా అత్తగారు నీ తిండి తినే వాళ్ళా?' అని సుందరమ్మ అందించింది. 'ఏమో, వీరు ఎలా అనుకున్నా నాకేం అభ్యంతరం లేదు.' సీత చెప్పి పెట్టుకున్న కోపంతో ధళ్ళని తలుపేసుకుంది. సుబ్బమ్మ నోట మాటరాలేదు!.

'అయిందా? నీ కోడలు గుణం యీ నాడు నీకు పూర్తిగా తెలిసిందా? నీదాని నిన్న మాకుతోమని అంత స్పష్టంగా చెబుతున్నా నీకు బోధపడదేం పిన్నీ? దాని మొగుడు గడించి దాని చేతులో పోస్తున్నాడు. వెర్రి దానివి వాళ్ళకౌపుగాని వాళ్ళ కంటికి నువ్వెవరవి? 'తల్లి వినమారు. పెళ్ళాకు చెల్లమారు' అని నువ్వు వినలేదటమ్మా? ఇక్కడింకా చాకిరీ చేస్తూ పడుండడానికి నీకేనా అంత సిగ్గులేకపోయింది? కానియ్, ఎవరేనా ఉట్టిగట్టుకు ఊరేగుతారా, లోకం గొడ్డోయిందనుకున్నారా? ఊరుకో పిన్నీ ఏడవకు; అని దుఃఖాన్ని సి. కాల్చింది సుందరమ్మ.

* * *

కొడుకు గుమ్మంలోకి వచ్చీ రాగానే సుబ్బమ్మ ఏడుస్తూ జరిగిందంతా చెప్పింది.

'బాబూ నేనింక యీ యింట్లో క్షణం ఉండలేనురా, నన్ను రైలెక్కించెయ్'

'నీకేమయినా మతిపోయిందా అమ్మా? కట్టుకున్న దుర్మార్గురాలి కోసం, కన్నతల్లిని వదులుకుంటారా? దాన్నే రైలెక్కించేస్తాను.'

'అవమానంగాని నువ్వు చేసి చూపించేదేవి, అత్తరోసా మా అమ్మకేది?' అంది సుందరమ్మ తను చేస్తున్నది ఉపకారమో అపకారమో తెలియక!

'ఇదిగో...యిప్పుడే!...దానికి అంటి దానికి ప్రస్తుతం కావలసిందో' అన్నాడు రవణ.

'నా నాన్నే! నా నానే!' అనుకుంది సుబ్బమ్మ.

* * *

'ఏమోనండీ, నాకు భయంగా ఉంది. పాపం ఆవిణ్ణి అనరాని మాటలన్నాను. అత్తగారు నన్ను క్షమిస్తారా? మళ్ళీ మామూలుగా ప్రేమిస్తారా?' రైలు కిటికీలోని భార్యకేసి నవ్వుతూ చూశాడు ప్లాటుఫారం మీదున్న రవణ.

'ఎంత అమాయకురాలివే సీతా నువ్వు! నాలానందికి విజరికన్న అబద్ధంమీగడ మేల్లు ఎక్కువనీ, స్వభావంకన్న నటనే రుచి అనీ నీకు తెలీదా?

ఈ లోకంలో సరదాగా బతకాలంటే కొంత నటన తప్పదునురి! వెర్రి అమ్మ!

ఆమె సంగతి నీకు తెలీదూ? ఒక్కరోజు నువ్వు కనబడకపోతే బాధపడిపోతుంది. నువ్వు ఒక్క ఉమాపణ ఉత్తరం రాస్తే అన్నీ మరచిపోతుంది.

నువ్వు నిశ్చింతగా గడిపిరా. మీ నాన్నకి మాత్రం నా చేతి క్రాడెంటు మరచిపోకేం?'

రైలు కదిలింది. 'నా మొగుడే! మా ధర్మాత్ముడే!!' అనుకుంది చిరునవ్వులో సీత! ★

# ఇంటి దొంగ

టి. ఎ. పి. ఆర్.

'శివరూపాయ విష్ణువే; విష్ణు రూపాయ శివతే' అన్నాడు తాతయ్య బొజ్జనిండా భోంచేసి హాయిగా పెరట్లో పడుకుని.

'ఏం తాతా! కడుపునిండా భోంచేసిం తరువాత వేదాంతం తంటపడుతోందే!' అన్నాడు అన్నయ్య పక్కవాడి నవ్వులుతూ.

'తాతా! విష్ణువుకీ, శివుడికీ రూపాయి లెందుకు?' అని అడిగాడు తమ్ముడు.

'శివుడికి విష్ణువు, విష్ణువుకి శివుడు రూపాయి రూపాయి అప్పు ఉన్నందున ఇద్దరు సమానం' అని అర్థం చెప్పాడు అన్నయ్య.

'ఆ! ఎందుకురా నీ నాస్తికమతం వాళ్ళకి కూడా నూరి పోస్తావూ!' అన్నాడు తాతయ్య నవ్వుతూ.

'ఆ నువ్వూరుకో తాతయ్యా. దీంట్లో నాస్తికమతం ఏముంది?.

'ఈ దంటూడెని కొంచెం తీసుకుంటారూ. మామగారూ! ఇందాకటినుంచి ఒకటే ఏడుపు,' అని అమ్మ దంటి పెళవని తాతయ్య బొజ్జమీద దిదసింది. వాడు ఆ పితభూమిమీద చిందులు తొక్కటం మొదలెట్టాడు.

'ఓ శేయబాబీ! దేముడి గూట్లో రూపాయి చిల్లర ఎవరు తీశా(రా? పాడు పిల్లలు. వాళ్ళోకి కూరలొస్తే కొందామని ఒక్క తేపడబ్బులు పెట్టుకుంటే బతకనీ యరుగదా! ఇంటిదొంగని ఈశ్వరుడైనా పట్టలేడుట,' అంది అమ్మ. అన్నయ్య అందరి జేబులు చెకింగ్ మొదలెట్టాడు. తమ్ముడు జేబులో సగం కొరికిన జీడిముక్క, బలపం దొరికాయి. వంటాడి జేబులో మాత్రం రూపాయి చిల్లర బయటపడింది.

'ఎక్కడ్రా ఇచ్చింది వంటాడికో చిల్లర? ఒక కొనుమింగితే ఏమన్నా ఉందా?'

'ఊ, ఏం కాలేదుగా ఎందుకొగోలా? వచ్చి అన్నంపెట్టు,' అన్నాడు నాన్న అప్పుడే కాళ్ళు కడుక్కోవటానికి దొడ్లోకి వచ్చి.

'ఓహో! తమరా ఇచ్చింది. ఉన్నమాట అంటే ఎందుకో అంతఉలుకు' అంటూ నాన్నవెంట లోపలికి వెళ్ళింది అమ్మ.

'అన్నయ్యా! ఇంటి దొంగని ఈశ్వరుడు పట్టటం ఎందుకు?' అన్నాడు తమ్ముడు.

'ఎందుకా! అలా అడుగు చెపుతాను. నీకు తెలుసుగా ఈశ్వరుడు విష్ణువుకి, విష్ణువు ఈశ్వరుడికి అప్పు ఉన్న సంగతి?'

'అలా అయితే అప్పు చెల్లు అయి పోతుందిగా?'

'అదే! ఎవరినోటుమీద ఎవరు ముందు చెల్లువెయ్యాలా అని.'

'ఆ, నాన్న దగ్గరికి వస్తే తీర్చేసేవాడుగా! కోజాలు ఇటువంటివి ఎన్ని తీరుస్తాడో,' అన్నాడు తమ్ముడు సెకండుక్లాసు మేజిస్ట్రేటు కొడుకు మొహం పెట్టి.

'అంతదాకా ఎందుకు? ఎవరి రూపాయి వారు రెండవ వారికి ఇచ్చి నోటు పుచ్చుకుందామనుకున్నారు. పాపం! శివుడికే చిక్కు. అందరిదగ్గరా ముష్టి ఎత్తాలి. విష్ణువుకేం లక్ష్మీదేవి సాక్షాత్తు సొంత భార్య ఆయెను.'

'మరి శివుడి దగ్గర కమండలం లేదా?'

'ఉంటే మాత్రం...'

'మరి దేవతల, దేముళ్ళ కమండలాలు మహిమ గలవిగదా! "సాక్షాత్తు శేషశయను డంతటివాడు అడిగాడు, ఒక్క రూపాయ రాల్చవే, ఓ చండ ప్రచండ కమండలమా" అంటే రాల్చదా, సువర్ణ సుందరిలోలాగా, మరి ఇదికూడా బల్లిదేగా?"

'అది సినిమా గాబట్టి జరిగిందిరా! అయినా ఈ మధ్య శివుడికి కోపంవచ్చి కుమారస్వామిని కొట్టబోయేసరికి దండం కాస్తా విరిగి పోయిందట. అందుకని కమండలం మరి పింపటం లేదుట.'

'ఊ, మరి ఏం చేశాడు శివుడు?'

'అందులో ఈ భారత ప్రభుత్వం ఆయనకు ఇంకో చిక్కు తెచ్చిపెట్టింది. అదే నయా పైసలు. ఈయనకు రూపాయి నోటు చెయ్యాలంటే ఈ కలియుగంలో అధమం నయాపైసా ధర్మం చెయ్యగలిగిన వంద మంది దాతలను సంపాదించాలి. ఎలాగైతే నేం ఐదురోజులు కష్టపడి 196 నయాపైసలు సంపాదించాడు. 96 మాత్రం తన తోలు పర్సులో వేసుకుని, మిగిలినవి పార్వతీదేవికి దాచమని ఇచ్చాడు. ఆమె వాటిని గూట్లో దాచింది.

తెల్లారి ప్రొద్దున్నే అప్పు తీరుద్దామని చూచేసరికి ఆ నూరు పైసలు మాయం. శివుడు చాలా దుఃఖపడ్డాడు; పార్వతీదేవి ఒడిలో తలపెట్టి అదే పనిగా విచారపడ్డాడు.'

'అంతదాకా ఎందుకన్నయ్యా! ఆయన త్రిశూలాన్ని గౌరీ మహాత్మ్యంలోలా మొహానికేసి కొట్టుకుంటే దివ్యదృష్టి రాదా?'

'అది దేవతలకి నటులు సర్దుచేసేదాకా రాదురా!'

'ఆ! అయితే అప్పు దేమయింది?'

'ఏమవుతుంది. పార్వతీదేవి అంది. "నాథా! లోకంలో ఇంతమంది ప్రసిద్ధ డిటెక్టివ్‌లని పెట్టుకుని ఇలా విచారిస్తే ఏం లాభం? ఎవరికద్దకన్నా వెళ్ళండి. మిమ్మల్ని చూస్తే ఎవ్వరూ ఫీజ్ తీసుకోరూ' అంది. ఎవరివద్ది కెడదామా అని ఆలోచించాడు, శివుడు. పరమరామ్ వద్దకు వెడదామా అంటే ఆయన చేసే హోటలు బిల్లులో సగోవంతు లేదే తనవద్ద ఉన్న 96 నయాపైసలు. అనుకున్నాడు.'

'"పోనీ అశ్వత్థామ దగ్గరకు వెళ్ళరాదా నాథా?" అంది పార్వతి.'

'"ఆయన ఎయిర్ కండిషన్ రూమ్ ఎక్స్‌ప్రెస్సుకి చాలదే ఈ 96"'

'"ఆ ఎక్స్‌ప్రెస్సు ఎంతనాథా! తేశేగా, అంటే 12 పైసలు. ఈ లెక్కన 96 పైసలు రూపాయిగా చెల్లగొట్టవచ్చు"'

"ఓసి పిచ్చిపిల్లా! నా బోటి వాళ్ళంతా జేగతొరవే దాంట్లో అఖిలభారత ముష్టి ప్రదర్శనం ఒకటి ఏర్పాటుచేశారు. అందుకని రేటు పెంచారు. లేకపోయినా 18 పైసలు నటూలు చేసేవారు," పార్వతీదేవి ముక్కున వేలేసుకుంది.'

"ఏన్నా కొలిదాయు ఉండగా ఎందుకింత బాధ; డబ్బు సంపాదించడం కష్టం; అది లేనప్పుడు పడేబాధ ఆయనకు విదితమే గదా!" అనుకున్నాడు. శివుడు. కాని అప్పు సురుకు రాగానే ఆయన తెడిసిపోయాడు. ఆచంచలమ్మ కుమ్మందగ్గరే నటూలు చేస్తుందిగా. ఫీజు పోస్తే యుగంధర్ దగ్గరికి పోదామా అంటే అతనికొరు ఈ మధ్య ఎక్కువ పెత్రోలులాగుతోందట. దానికేం సరిపోతాయి శివుడిదగ్గరి 96 నయాపైసలు. ఏ డముకుల విగ్రహం గుర్తుకువచ్చింది. తరువాత తెల్లప్యాంటు, నుసిం-లీవాని పాదు గాటిచుట్టు, గుర్తుకువచ్చాయి. ఎర్రగీరల కాష్మీకలర్ కోటుతో, నక్షత్రాల హైతో,

......ఇంకెవరు డిటెక్టివ్ వాళ్ళ, ఆయనదగ్గరికిపోదామా అనుకున్నాడు.

'బాధా! ఎందుకు ఇంతవ్యథ. డిటెక్టివ్ ఆర్. కె. బి. షవ్ ఉండగా' అంది పార్వతీ. ఆమెను ఆ అయిడియా ఇచ్చినందుకు మెచ్చుకుంటూ బయలుదేరాడు శివుడు.

డిటెక్టివ్ షవ్ గారిది, చిల్లికట్ట ప్రాక్టీసు. పార్టీలందరూ బైరాగులే తగుల్తూ ఉంటారు. ఫీజు ఇవ్వవలసి వచ్చేసరికి, ఈయనెన్న అప్పు అడిగి 'హే అనాథరక్షకా' అని కొళ్ళేచి పోతారు. ఈయనకొక అసిస్టెంటుగూడా. ఆయన పేరు: ఆర్. బి. ఎమ్. ధవ్ అంటే పూర్తిపేరు బి. మాధవరావు. నవీనయుగ పంథాన 'రావు బి. మాధవ్' అన్నారు. కాలక్రమాన్న అది ఆర్. బి. ఎమ్. ధవ్ అయింది. గురువుగారి నామంగూడా కె. వైష్ణవరావు. అదిగూడా పై విధానే మార్పులు పొందింది.

'సరేగాని అసలు ఆయన శివుడు కేసు తీసుకున్నాడా? ఫీజు ఏం అడిగాడు.

'ఆ ఫీజు స్వల్పం. ఒక్క గ్లాసెడు అమృతానికి ఆశపడ్డాడు. అదిగూడా మహేంద్రా బార్ లో అయిపోయిందంటే పోతూ పోతూ హైదరాబాదులో పోయించి తీసుకుపోయాడు శివుడు.

మరి ఆయనదగ్గరున్న 98 పైసలు మూడు టికెట్లకి సరిపోయిందా?'

'ఆ! కమండలం, దండంపోయినా పట్టుకుచ్చుల తుంగచాప మిగిలిందోయ్. దాని మీద వెళ్ళారు ముగ్గురూ.'

'ఆ! నువ్వేదో చెపుతావుకొని ఈశ్వరుడు తలుచుకుంటే ఎన్ని రూపాలయినైనా వస్తాయి. అన్నాడు తాతయ్య నవ్వుతూ.

'దారులు కొయటానికి దండం విరిగిపోయింది తాతయ్యోయ్, పత్తురూపాయ లొత్తటానికైనా పెట్టుబడిప్రధానం.'

'ఇంతకీ ఏమయ్యాయోయ్ ఆనూరు పైసలు,' ఊరికి ఉత్తరాన ఉత్తరేణిచెట్టు మొదల్లో ఉత్తవేళ్ళ మధ్య నున్నాయని చెప్పతేవా తెచ్చుకుందామని అడిగాడు తమ్ముడు.

'అదే మిస్టర్ షవ్ సమస్య. డిటెక్టివ్ కి పెద్ద చిక్కు వచ్చింది. అందరిలాగా వీరు గూడా వీరి పరిశోధనా ఫలితాలు టాబ్యులేటు చేశారు. 'పోయినవి...నూరు నయాపైసలు... నేల నుంచి సుమారు ఒక అడుగు ఎత్తున్న గూట్లో...పట్టుకొనవలసింది...సదరు రూపాయ తాలూకు నాణాల్ని కొట్టేసిన అతడు ఆమెను, సొంత బాధ్యత (ఖర్చు)మీద తెచ్చుకున్న ఎల్లోరా సిగరెట్టు పాకెటుతీసి మిగిలిన చివరి సిగరెట్టు వంక తీక్షణంగా చూస్తూ ఆలోచించాడు. ఆలోచించి...చించి అది వెలిగించాడు. 'అమ్మాయ్! నువ్వక్కడే పెట్టావా? బాగా గుర్తుందా? అని అడిగాడు.

'అయ్యో రామా! గుర్తు లేకపోవటం ఏమిటి. నిన్న మాకు మా గ్రామపు గుడి నుంచి వచ్చిన కొబ్బరిచిప్పలో పెట్టి ఆ గూట్లో పెడితేను; అంది.

'ఒక్కటేనా వచ్చేది?'

'ఆ! మాకు ఒక్కటే వస్తుందిలెండి. మిగిలింది మధ్యవాళ్ళకి పోతుంది.'

వినాయకుడు అప్పుడేవచ్చాడు. డిటెక్టివ్ ను చూచి రుసరుసలాడుతుంటూ వెళ్ళిపోయాడు. ధవ్ కి ఆలోచన తట్టింది.

'వినాయకుడి కివి నెలాఖరు రోజులు వంటివి. లడ్డూల స్టాక్ ఐపోతే బందరు లడ్డూలకేమన్నా హారతి పాడలేదు గదా పైసలు' గురువుగారి చెవి కొరికాడు శిష్యుడు.

'కుమారస్వామి, అమృతానికి బారులో తగలెయ్యగూడదేమిటి?' గురువుగారు శిష్యుడి చెవి నమిలారు.

'ఆ మాటకొస్తే ఇక్కడందరు బైరాగులే. అందరు గంజాయి దమ్ముకి మొహం వాచి ఉన్నవాళ్ళే,' అన్నాడు శిష్యుడు, గురువుగారి చెవి నమిలి మింగేస్తూ. గంజాయి దమ్మంటే గుర్తు వచ్చిందిగావును, ఇందాక ఆర్పేసిన సదరు ఎల్లోరా సిగరెట్టు తాలూకు ముక్కను వెలిగించాడు.

కడుపులో పేగులు గుడగుడమన్నాయ్. బొడ్డు దగ్గరనుంచి ఆలోచనలు పైకి తన్నటం మొదలు పెట్టాయి. మెదడు చురుగ్గా పని చెయ్యటం మొదలుపెట్టింది. 'గురువుగారు వేడివేడి దమ్ములాగి ఆలోచిస్తే మనం చల్లటి గుక్క త్రాగి ఆలోచిద్దాం' అనుకున్నాడు ధవ్.

'చించాను...ఆలోచించాను...వచ్చింది సిగరెట్టు ఐపోయిందంటే పోతుంది... పట్టా...పలుగు...పట్టా...ఊ' అని అరిచాడు, షవ్. ఉలిక్కిపడి లేచి వెళ్ళి పలుగు తెచ్చిపెట్టాడు ధవ్. గబగబ వాహన మూషికపు కలుగు త్రవ్వేడు. అందులో ఎలిక కొరికిన కొబ్బరిచిప్ప, అందులో నూరు నయాపైసలు బైటపడ్డాయి.

'ఎలా కనుక్కున్నారు గురూ?' అన్నాడు ధవ్.

షవ్ గొప్పగా పోజ్ పెట్టి ఏదో చెప్పబోయాడు. అంతలో 'ఒద్దులే గురూ! అర్థం అయిందిలెండి!' అన్నాడు.

తలదాకా తన్నిన ఉత్సాహం తోకదాకా జారిపోగా, వాడిపోయిన తోటకూర కాడల్లా చేతులు వ్రేలాడేసి నుంచున్నాడు షవ్. చివరిదాకా కాలిన సిగరెట్టు చేతిని ముద్దెట్టుకునేసరికి, ఆతురతతో చివరి దమ్ములాగి క్రింద పారవేశాడు. శివుడు అప్పుడు 'నాయనా! నీ మేలు మరువలేను. అందువలన నేను నీకు ఒక వరం ఇస్తున్నాను. లోకంలో 'ఇంటి దొంగను ఈశ్వరుడు అయినా పట్టలేడనే' నానుడి ప్రసిద్ధం అవుతుంది.' అన్నాడు. ఇప్పుడైనా తెలిసిందా ఈశ్వరుడికీ...ఇంటి దొంగకి సంబంధం.' అన్నాడు అన్నయ్య. 'ఊ' అంటూ ఇటునుంచి అటుదొర్లి నిద్రలోకి జారిపోయాడు తమ్ముడు.



# శకునపక్షి

పందిరి మీద చక్కని చుక్కల్లా పరుచుకున్న పొట్ల పువ్వుల్ని చూస్తూ కూర్చున్నాను. ఆ పుష్పాల్లోని స్నిగ్ధత్వం నన్ను ఆశ్చర్యంలో ముంచివేసింది. పాలరాతిలోని ధవళిమ, వెన్నెలలోని తళుకు-నిండారుగా నింపుకున్న ఆనందంతో-గర్వంతో-ఆ పొట్ల పువ్వులు నన్ను మరీ మరీ తొంగి చూశాయి. నాకు తగని ముచ్చట వేసింది.

ఆ పొట్లపువ్వులమీదుగా సన్నని, కమ్మని పరిమళం మోసుకుని ఓసారి చల్లని, చక్కని గాలితెర నాపైగా ప్రసరించింది. ఆ పరిమళం, చందనపు పూతవంటి ఆ చల్లని గాలి తాకిడి-భరించలేక పైట కొంగు ముసుగు కప్పుకుని ఓసారి కళ్లు మూసుకున్నాను.

ఓ క్షణం-అంతే-మంచులాటి, సన్నని ముత్యాలలాటి నీటి తుప్పర - నా పైన - నా ప్రక్కన జలజలా పడటం ప్రారంభించే సరికి-గబాలున తలపైకెత్తి చూచాను. రాత్రి కురిసి వెలిసిన వానకు చిహ్నంగా - పొట్ల పువ్వులమీద-ఆకులమీద-క్రమ్ముకొని ఉన్న నీటి తుంపర్లను-అదొక పనిగట్టుకుని ఓ కాకమ్మ వచ్చి తీరిగ్గా దులుపుతున్నది.

పొట్ల పువ్వుల అందం, ముగ్ధత్వం - స్నిగ్ధత్వం-మధ్య ఈ బండకాకి యేమిటే! ఈ రెంటికీ యేకోశానైనా పొత్తు కుదురుతుందా? నాకు మహాచిరాకు వేసింది.

'ఉష్' అన్నాను చెయ్యి ఊపుతూ.

ఆవిడ కదల్లేదు అక్కడనుంచి.

'ష్!...హోష్!' అన్నాను మరి కొంచెం ఊతంగా.

## వేదవతీదేవి

ఆవిడగారు నా వంక మిర్రిమిర్రి చూస్తూ స్థానబలిమి మరికొస్త సమంగా కుదుర్చుకున్నది.

నాకు విసుగుపుట్టింది. మౌనంగా, నిర్లిప్తంగా, సర్వసంగపరిత్యాగినివలె ముఖం పెట్టి-ఏమిచేస్తుందో చూదామని ఆవిడవంక చూస్తూ కూర్చున్నాను.

ఆవిడ దీర్ఘాలు ప్రారంభించింది. ఆ దీర్ఘాలున్నూ, నా వంకే ఉలుకూ, ఉలుకూ చూస్తూ, ఎడతెగకుండా-శ్రుతి తప్పని ఏక స్వరంతో తీస్తోఉన్నది.

నాకు చటుక్కున ఏదో స్ఫురించింది. ఈ కాకమ్మ నాతో యేదో చెపుతూ ఉన్నది. సందేహంలేదు!

'ఏమిటిసంగతులు కాకమ్మా'-అంతర్యంగా అడిగాను.

ఆవిడవి అవే రాగాలు. నాకు అర్థం తెలియలేదు. 'పోనీ, ఎవరేనా వస్తున్నారా చెప్పవ్?' ప్రాధేయపడుతూ అడిగాను.

కాకమ్మ నోట్లోంచి జవాబు యింకా రాకముందే, పరుగుస్తూ-పరికిణీ చెంగులు ఎగదోపుకుంటూ, ఎక్కడనుంచో పరిగెత్తుకు వొచ్చింది చిలక.

పన్నెండేళ్ల చిలక మా పని పిల్ల. దానికి వాళ్ళఅమ్మా నాన్నా పెట్టిన పేరు సీతారత్నం. దాని అఖండమైన తెలివితేటలూ, చురుకుదనమూ, నల్లటి ముఖంలో తళతళ మెరిసే దాని కళ్ళూ చూచి-దానికి 'చిలక' అని తప్ప ఈ జగత్తులో మరేపేరూ అంత అతికినట్లు సరిపోదని నిర్ణయించేసి-నామకరణం చేశాను దానికి. అప్పటినుంచీ-ఇంట్లో అందరికీ అది 'చిలక' అయిపోయింది.

'అమ్మాయిగోరూ...' అంది చిలక యింకా రొప్పుతూనే.

'ఏమిటే...' అన్నాను పొట్లతీగె మీంచి చప్పున దృష్టి మరల్చి.

ఊళ్లో వార్తలూ, కబుర్లూ, వింతలూ-ఎక్కడెక్కడివి సేకరించి మోసుకొస్తుంది చిలక. అట్లా యేదో విశ్రాంతిపోయే (దాని లెక్క ప్రకారం) వార్త విన్నబాడు. అది నా దగ్గరికి అంతలా పరిగెత్తుకు వస్తుంది.

ఆ సంగతి నాకు తెలుసును కనుక నే—అది చెప్పబోయే కబురు యేమిటో వినాలని-నాకూ కుతూహలం యెక్కువైంది.

'ఓసి, చెప్పవే, తర్వాత రొప్పుదువుగాని'...అన్నాను ఉత్కంఠతో.

'మరండీ, మన పక్కగా కొత్తగా డాబా కట్టలేదూ, అందులోకి ఇంగిలీషు వాళ్లు వస్తున్నారట. ఇంగిలీషువాళ్లు'—అన్నది ఒక్క పట్టాన.

ఈసారి రొప్పు నాకు ప్రారంభమైంది. 'ఏమిటే, ఇంగిలీషువాళ్లే!' అన్నాను అదిరిపడి.

చిలక నా వంక గర్వంగా చూసింది. సాధారణంగా అది మోసుకొచ్చే కబుర్లు విని లోలోన ఆశ్చర్యపోయినా, ఆనందించినా—పైకి కనిపించనీయని నా గంభీరత చూచి—ఉత్సాహమంతా నీరై పోయినట్లు వెళ్ళిపోయేది. ఇవాళ దాని మాటలు నాలో కలిగించిన ప్రభావానికి అది కొండెక్కినంత సంబరపడుతూ నావంక చూసింది.

'మరండీ, చక్కా, మీక్కూడా ఇంగిలీషు వచ్చుకదండీ! దొరసానిగోరూ, మీరూ ఇంచక్కా మాట్లాడుకోవచ్చు! అప్పుడెంత తమాషాగా ఉంటుంది అమ్మాయిగోరూ!...ఎంత తమాషాగా వుంటుందో ఊహించుకుంటూ కళ్లు అరమూసి అన్నదిచిలక.

ఈసారి చిలక మాటలు నాపైన పిడుగు వలె పని చేశాయి. అది యేదో మిషతో నా వెన్నుమీద చరిచినట్లూ, నన్ను అవమాన పరిచినట్లూ—అనిపించింది. నా గుండెలు వేగంగా స్పందించిపోయాయి. సంవత్సరం నాడు మూలపడేసిన సెకండురీడరూ, చదువు మానేసి పనిపాటలు నేర్చుకోమని పోరుపెట్టి మానిపించిన నాయనమ్మ ముఖమూ-సినిమా రీల్సులా నా కళ్ళముందు తిరిగాయి.

కాని చిలక్కి ఎందుకో నాపైని అపోహ. నాకు ఇంగిలీషు బాగా వచ్చుననీ, నాతో సరిగా మాట్లాడగలవారు ఆ వూళ్ళోనే ఎవరూ లేరనీ, దాని ఆ అపోహను—స్వాభిమానం చేత కానీ, ఆ ఊహ నాలో కలిగించే సంతృప్తి వల్లకానీ, నిజం చెప్పగలధైర్యం లోపం కావడంచేత కానీ-చిలవలూ పలవలూ వేసి పోషించుకుంటూ-అంతరిక్షానికి ఎగరవేస్తూ వచ్చాను యిన్నాళ్ళనుంచీ. నేను గోటా తిరగవేసే పత్రికలూ, కథలపుస్తకాలూ అన్నీ ఇంగిలీషువే నని చిలక్కి గట్టినమ్మకం!

చిలక్కి పారవశ్యమూ తగ్గలేదు, నాగుండెలు కొట్టుకోవటమూ తగ్గలేదు. ఇంట్లోంచి అమ్మ వేసినకేకకు అదిరిపడి చిలక లోపలికి పరిగెత్తింది. ఇంకో పొట్లపందిరిమీద తిష్ట వేసుకుని ఉండి ఉండి రాగాలు తీస్తున్న కాకమ్మవైపు కొరకొరా చూస్తూ, నేనూ మెల్లగా ఇంట్లోకి దారితీశాను.

అదీ సంగతి. మాది వెనుకటి పద్ధతులూ, ఆచారాలూ బొత్తిగాపోని శుద్ధపల్లెటూరు. మగవాళ్లలో ఒకరో అరో తప్ప పెద్ద చదువులు చదివినవాళ్లూ, చదివి నెగ్గిన వారూ ఎవరూ లేరు. దూరానఉన్న పట్నంతో కూడ మాఊరికి అట్టే సంబంధం లేదు. మా ఊరివాళ్ళ పల్లెటూరితనం ఎంతస్థాయిలో ఉన్నదంటే-ఓసారి మామామయ్యగారి కొత్త అల్లుడు బస్తీనుంచి వొచ్చినప్పుడు ఆ అబ్బాయి సూటూబూటూ ఊరుఊరంతా విరగబడి వొచ్చి చూశారు. అది చూసి మాపక్కింటి లక్ష్మమ్మఅత్తయ్యవాళ్ల అల్లుడు వొచ్చినప్పుడు 'ఓసారి లాగూలో చొక్కా వేసుకోనాయనా, చూడాలని ఉందని' ముచ్చటపడిందని మాచిలక ఒకరోజున వార్త కూడా తెచ్చింది.

అటువంటి పల్లెలో పుట్టి పెరిగిన నేను నాన్నగారి ప్రోత్సాహంతో కొన్నాళ్ళు ఇంట్లోనే పంతుల్ని పెట్టుకుని చదువుకున్నాను. నేను ఇంగిలీషు సెకండరీడరులోకి వొచ్చేటప్పటికి నాఖర్మకాలి నాకు పదమూడవయేడు రావడమూ, అమ్మముఖమూ నాయనమ్మముఖమూ చూచి నాన్నగారు నా చదువు మానిపించేయడమూ జరిగింది.

మాఊరిపక్కగా ఓమూంచి కాలవ ఉంది. ఉరవళ్ళూ పరవళ్ళూ వేసుకుని వర్షాకాలంలో అయేరు ప్రవహించిపోతున్నప్పుడు మాఊరివాళ్లందరికీ మతులు పోయేంత ఆనందం. ఆ కాలవ మా అందరికీ తల్లిలాటిది. నిప్పులుచెరిగే వేసవి ఎండలలో, ఆయేరు కృశాంగియై, సన్నని చీలికలుగా, కలశధారలలాటి పాయలుగా, రాళ్లలోంచి, రప్పలలోంచి, ఇసుకలోంచి పారుతూ వస్తుంది. కన్పించిన ఆనాటి సొంపూ మాకు రమణీయంగానే ఉంటుంది.

ఆ వేగవాహినిపైన ఈమధ్యనే ఓవంతెన కట్టారు. క్రిందుగా లాకులు ఏర్పాటుచేసి, ఈగట్టునా ఆగట్టునా చింతమొక్కలూ, అంటుమామిడి మొక్కలూ నాటారు. ఆ లాకులపైన ఆఫీసరుగా వేసిన ఇంగిలీషాయనా ఆయన కుటుంబమూ త్వరలో మా ఊరు వొస్తారని ఊరంతా గగ్గోలుగా చెప్పుకుంటున్నారు.

* * *

ఊరందరి కన్నా చిలక్కి, నాకూ సంరంభం హెచ్చింది మాప్రక్కనే ఉన్న డాబాలోకేట వాళ్ళు రావటం! పనిచేస్తూ చేస్తూనే మధ్యలో చిలక్కి ఇంగిలీషు వాళ్ళని గురించిన ఏదో సందేహం కలిగి నాదగ్గరకు వచ్చి 'మరి, అమ్మాయిగోరూ' అంటూ ఆరంభిస్తుంది. వాళ్ళు ఫలానా రకంగా ఉంటారనీ, వాళ్ళ ఆచారాలు ఫలానా మోస్తరులో ఉంటాయనీ — ఒక నిర్ధారణ అయిన భావం నాకూ లేక పోయినా — చిలక ప్రశ్నలకి యేదో యూధి అయిన జవాబులు చెప్పటమూ — అది మహా విస్తుపోతూ కళ్ళప్పజెప్పి నుంచోవటమూ— ఇంతలో అమ్మో, నాయనమ్మో -- చెంప

పెట్టులాటి పాలికేక వేయడమూ — మా యింట్లో పరిపాటి అయిపోయింది.

మా ప్రక్కకు వస్తారనుకున్న ఇంగిలీషు వాళ్ళనిగురించి ఆలోచనలూ, తర్జన భర్జనలూ — అమ్మకూ నాయనమ్మకూ కూడా తలక్కుపోలేదు. ఇంగిలీషు వాళ్ళ పొరుగు ఎట్లా ఉంటుందోననీ, వాళ్ళతో ఎట్లా మెలిగితే ఏమి తంటా వొస్తుందోననీ—ఇలా ఉండేది వాళ్ళధోరణి.

ఓ సుప్రభాతాన నేను మంచి నిద్ర మైకంలో ఉండగా చిలక ఉపద్రవంగా వొచ్చి నన్ను తట్టిలేపింది.

'అబ్బ, ఏం మించిపోయిందనే అంతలా లేపుతావు?...అన్నాను కోపంగా.

'అది కాదమ్మాయిగోరూ, వాళ్ళు వొచ్చారు, వాళ్ళే ఇంగిలీషువాళ్ళు' అన్నది నా చెవిలో రహస్యంగా.

చిలక అంట్లచేతులూ, మసి చేతులూ తెచ్చి నన్ను తట్టిలేపింది. ఆ కోపం కూడా మరిచిపోయి అమాంతం లేచి పెరట్లోకి వెళ్ళి పడ్డాను.

డాబా యింట్లో మనుష్యుల సందడి మొదలింది. ఒకరిద్దరు నౌకర్లు గావును — ఎవరో తమని వెనకనుంచి తరుముకొస్తున్నట్టు ఉరుకులూ, పరుగులూ తీస్తూ-పనులు చేస్తున్నారు. ఓ బొచ్చుకుక్క ఇల్లంతా తనదే అన్నట్లు ఓ తిరుగుతోంది.

కిటికీలకు వాళ్ళు కట్టుకున్న తెరల సందు నుంచీ అటూ యిటూ నడుస్తున్న ఓ గౌనూ, ఎత్తు మడమల బూట్లూ — మరొక సూటూ బూటూ — చిలక వేలుపెట్టి నాకు చూపించింది. అలా వేలుపెట్టి చూపించవొద్దని చిలకని కసురుతుండగానే నాయనమ్మ పిలుపు వినిపించింది.

'పద్నాలుగేళ్ళొచ్చాయి, పొద్దున్నే లేచి షికార్లు చేయకపోతే ముఖం కడుక్కో కూడదుటే? ఇంకా ఎప్పుడు తెలుస్తుందీ?'

నాయనమ్మని మాట్లాడవొద్దని సైగచేసి నాదగ్గరకు పిలిచి డాబా యింటికేసి చూపించాను. ఆ తర్వాత నేను ముఖం కడుక్కోవటమూ, స్నానం చేయటమూ, తల దువ్వించుకోవటమూ పూర్తి అయిందకాని — నాయనమ్మ డాబా యింటికేసి చూడటం మాత్రం పూర్తి అవలేదు!

చిలక్కి పనిలో ఎక్కడలేని చురుకూ వొచ్చింది. అది గంటలో చేసే పని రోజూ పావుగంటలో చేసేయడమూ-డాబా యింటి చుట్టూ ప్రదక్షిణాలు కొట్టి-నాకు ముచ్చట్లు చెం వేయడమూ అలవాటయింది.

'అమ్మాయిగోరూ, ఇంగిలీషువాళ్ళకి జుట్టు అంత పొట్టిగా ఉంటుందేవిటండీ!'

'మీకు పద్నాలుగేళ్ళే కదా, ఓణీలు వేసుకుంటున్నారు కదా, ఆ దొరసాని అంత పెద్దది, చిన్నపిల్లకి మల్లే గౌను వేసుకుంటుందేవిటండీ!'

'ఓయమ్మో, ఆ చాయ యేమి చాయ! అంత యెర్రగా ఉంటారేవండీ ఇంగిలీషు వాళ్ళు!'

'ఓలమ్మో, అమ్మాయిగోరో! వాళ్ళు కత్తుల్తో తింటారుటండీ తిండీ! వాళ్ళ వంటాయన చెప్పాడు!'

మొదట్లో చిలక్కి ఇంగిలీషువాళ్ళమీద కలిగిన సందేహాలూ, సంభ్రమాలూ యిలాటివి. చిలక్కే కాక నాకూ, ముఖ్యంగా అమ్మకూ, నాయనమ్మకూ, వాళ్ళని గురించి, వాళ్ళ పద్ధతుల్ని గురించి, మహా విచిత్రంగా ఉండేది.

నాయనమ్మకి ఓ గొప్ప బాధ. 'ఎంత ఇంగిలీషువాళ్ళయితే మటుకు ఆడది సైకిలెక్కి తొక్కడమేమిటి' అని. ఆడజాతి సంరక్షణకు తాను కంకణం కట్టుకున్నట్టునూ, ఆ యింగిలీషావిడ తనకు ఎదురుతిరిగినట్టునూ.

చిలక తంటాలుపడి దొరసానితో పరిచయం చేసుకుంది. ఆవిడకు కొంత కొంత తెలుగు కూడా వచ్చునుట! చిలక ఆఘ మేఘాలమీద తేలిపోతోంది.

ఆనాడు బావిదగ్గర నీళ్ళు తోడుతున్నదల్లా, చిలక చెంగున ఎగిరి నాదగ్గరికివొచ్చి, 'అమ్మాయిగోరూ, వాళ్ళింట్లో ఏడుపు వినపడటం లే?' అన్నది. చెవి ఒగ్గి విన్న నాకూ అలాగే వినిపించింది. మరో క్షణంలో ఇద్దరం వాళ్ళ కిటికీతెర క్రిందుగా నిలబడి ఉన్నాం.

ఎంతసేపటికీ విషయం తెలియకపోయేప్పటికి నాకు ఊపిరి సలపలేదు. చిలక ధైర్యం



మద్రాసులో ప్రదర్శనలు సాగిస్తున్న కమలా త్రీరింగ్ సర్కస్‌లో ఒక దృశ్యం.

చేసి మునికాళ్లమీద నుంచుని కిటికీతెర సందులోంచి ఒక్కసారి లోపలికి తొంగి చూసింది. అంతే, నోటికి చెయ్యి గట్టిగా అదిమేసుకుని అది మరోక్షణంలో ఇంట్లోకి వచ్చిపడ్డది. దానివెనకే నేనూ ఒక్క అంగలో ఇంట్లోకి పరుగుతీశాను.

అది ఆయాసంలో చతికిలబడి 'ఇంకొసేప్పుంటే అరిచేద్దును!' అన్నది.

'ఏం కనిపించిందే, చెప్పు, చంపక!' అన్నాను ఆదుర్దాగా.

'ఓరి బాబో, వాళ్ళిద్దరూ పోట్లాడుకుంటున్నారండీ నెట్టుకుంటూనూ!'...చిలకకళ్లు నేనెన్నడూ ఎరగనంత పెద్దవి అయినాయి.

నాకు క్షణమాత్రం ఏ ఆలోచనా తోచలేదు. ముందు ఏడుపు-సరే-పోట్లాటకూడా యేమిటి? ఈ రెంటినీ ఎట్లా అతికించాలి?

ఆ సాయంత్రంకూడా ఇదే ఆలోచిస్తూ బుర్ర బద్దలు కొట్టుకుంటుండగా చిలక నవ్వుతూవచ్చి ఓ చిత్రం చెప్పింది.

అది ఏడుపు కాదుట! వాళ్ళ పాటలుట! అది పోట్లాట కాదుట! వాళ్ళ నాట్యంట! చిలక్కి వాళ్ళ నౌకరు చెప్పాడుట!

మనసు ఎంతో తేలికచ్చి దీర్ఘంగా నిశ్వసిస్తుండగా, చిలక నా చేతిలో ఓ చీటీపెట్టి, దొరసాని నాకివ్వమన్నదని గర్వంగా చెప్పింది. విప్పిచూద్దునుగదా, ఇంగ్లీషు! నాకు కళ్లుతిరుగుతుండగా చిలక చెప్పుకొచ్చింది. ఇందాక తాను వాళ్ళింటికివెళ్ళి వస్తూవుంటే తోటలమీదుగా, 'మా అమ్మాయి గారికి ఇంగ్లీషు మాబాగావొచ్చు' అని చెప్పిందట. ఆవిడ సంతోషంగా 'అలాగా, అయితే నాతో చెప్పలేదేం?' అని గబాలున లోపలికి వెళ్ళి యీ చీటీరాసి నాకివ్వమన్నదట!...చిలకకళ్లు ఘనంగా, గర్వంగా, మెరిశాయి.

దాన్ని నమిలి మింగేయాలనిపించింది. తన కెందుకు చోడికి! ఇందులో ఏమిరాసి ఉంటుంది? జవాబు రాయాలా? ఏమని రాయాలి? ఎట్లా రాయాలి? రాయకపోతే ఏమనుకుంటుందో!

తలనొప్పిగా ఉందనీ, జవాబు రేపు వ్రాసి యిస్తాననీ, చెప్పమని చిలక్కి చెప్పి పంపాను.

చిలక కాస్సేపటికి ముఖం వేళ్ళాడేసుకు వొచ్చింది. ఇంగ్లీషావిడ ఇలా అందట:

'రేపు జవాబు రాయడమేమిటి? అసలు ఏకే చదువుతున్నారా మీ అమ్మాయి గారు? ఇంగ్లీషు వచ్చునంటే నాకు చాలా సంతోషం వేసి ఒకసారి మాయింటికిరమ్మని, పరిచయం చేసుకుందామని పిలిచాను. దానికి రేపు జవాబు వ్రాసి యివ్వడమేమిటి? అసలు ఇంగ్లీషువొచ్చా మీ అమ్మాయి గారికి?'

ఇదీ ఆవిడ మాటలు. నాకు వొళ్ళు మండింది. అసలు తనని చీటీ వ్రాయమన్న దెవరు; నాకు ఇంగ్లీషు వొచ్చోరాదో పరీక్ష చేయమన్న దెవరు? ఓహో, తానుకాగా దొరసాని!

ఈ ఘటన జరిగాక ఇంగ్లీషువాళ్ళని గురించీ, వాళ్ల ఆచార వ్యవహారాల గురించీ నాకు కుతూహలం బొత్తిగాపోయింది. వాళ్ల చుట్టూ నేను యిన్నాళ్ళుగా నిర్మించుకున్న వింత, కొత్తదనం, భయం, ఔత్సుక్యం—అన్నీ ఎలా వచ్చాయో అలాగే పోయాయి.

ఆతర్వాత నేను డాబాయింటికేసి తొంగి కూడా చూడలేదు. తర్వాత కొద్దిదినాలకే వాళ్ళు లాకుల దగ్గర కట్టిన క్వార్టర్లుట క్వార్టర్లు—వాటిలోకి వెళ్ళిపోవడం జరిగింది.

ఈ మార్పు చిలక్కి దిగులూ, నాకు హాయీ కలిగించింది. కాని పొట్లపందిరిమీద ఎప్పుడైనా ఓ కాకమ్మవాలి దీర్ఘాలుతీసినప్పుడల్లా నాకు భయం—మళ్ళా ఏ ఇంగిలీషు వాళ్ళని తెస్తుందోనని! ★

## సైన్సు తెలిసినపోలీసు

స్కూల్లో ఏదో ఉత్సవ సందర్భంలో కొందరు పిల్లలు వినోదవేషాలు రకరకాలుగా వేసి ప్రదర్శిస్తున్నారు. పిల్లల్ని తప్ప పెద్దవాళ్ళని లోపలికి రానివ్వడంలేదు. ఒకావిడ ఆదుర్దాగా లోపలికి పరుగెత్తుకు రాబోతే గేటుదగ్గిరున్న పోలీసువాడు అడ్డగించాడు.

"పెద్దవాళ్లకి కాదమ్మా ఇది; పిల్లలకే," అన్నాడు.

"ఆ సంగతి నాకూ తెలుసోయ్ పోలీసూ. లోపల మా చిన్నమ్మాయి సీతాకోకచిలక వేషం వేస్తోంది. వేషం అంతా తీసికెళ్లింది గాని రెక్కలు ఇంటిదగ్గరే మర్చిపోయింది. అవి తీసుకొచ్చాను ఇద్దామని."

"లాభం లేదమ్మా. మీ అమ్మాయిని ఇవ్వాళ్టికి గొంగళి పురుగ్గానే ఉండనివ్వండి" అన్నాడు పోలీసు చిన్నప్పుడు చదువుకున్న సైన్సుపాఠం జ్ఞాపకం తెచ్చుకుంటూ.



లైఫ్‌బాయ్ సబ్బుతో ప్రతిరోజూ స్నానము చేసి మురికిలోని క్రిముల బారి నుండి మీ ఆరోగ్యమును కాపాడుకొనుడు. ఇందువల్ల మీరు మరల హాయిగా నుందురు.
LIFEBUOY
SOAP



# పకపకలు

రోగి: రోజు రోజుకీ జబ్బు పెరిగి పోతున్నదండీ!

డాక్టరు: పెరగనివ్వండి. మీరేమీ భయపడవలసిన అవసరం లేదు. 'పెరుగుట విరుగుటకొరకే' అన్నారు మన పెద్దలు.

* * *

ఒకడు: వాడికి నోరు కూడా మూతపడిపోయిందండీ. ఏదైనా ఆహార మివ్వటానికైనా చాలా కష్టంగా ఉన్నది.

డాక్టర్: అరెరే! పెద్ద చిక్కొచ్చిపడ్డదే! రేపట్నించి టెంపరేచర్ చూడటానికి ధర్మామీటరు ఉపయోగించే వీలు లేదన్నమాట.

* * *

డాక్టర్: ఇకమీద మీరు సిగరెట్లు తాగడం మానేసెయ్యాలి.

రోగి: అయితే సిగరెట్ల బదులు ఏం తాగమంటారు?

* * *

డాక్టర్: ఏమయ్యా! బిల్లు కోసం ఎన్నిసార్లు కబురు చేసినా పైకం పంపవేం?

రోగి: జబ్బు నయమయింది కాని కనీసం బిల్లు చెల్లించే ఓపిక కూడా లేదండీ.

* * *

ఒకడు: మా వాడికి మీరు పునర్జన్మ కలిగించారు. మీ ఋణం తీర్చుకోలేనిది.

డాక్టర్: ఆ దానికేం లెండి! త్వరలోనే బిల్లు పంపుతాను.

* * *

## డాక్టరు: రోగులు

డాక్టర్: ఈ జబ్బు తగ్గిపోవాలంటే రోజుకి 1 ఇంజక్షన్ చొప్పున 25 రోజులు తీసుకోవాలి.

రోగి: రోజూ కాళ్ల తిప్పట ఎందుకులెండి! ఆ ఇచ్చే మొత్తం ఇంజక్షనులు ఇవాళే ఇచ్చేయండి!

* * *

ఒకడు: రాత్రంతా బాగా నిద్దర పట్టినా తెల్లవారేసరికి వళ్ళంతా ఎందుకో నొప్పులు పుడుతున్నాయండీ.

డాక్టర్: అంతే లెండి! నిద్ర సుఖమెరగదు.

* * *

ఒకడు: పొద్దుననంగా వచ్చిన తలనొప్పి ఇంతవరకు తగ్గలేదు. ఏదైనా మంచి మందు ఇప్పించండి! తల పగిలిపోతున్నది.

డాక్టర్: (కాంపౌండర్ని పిలుస్తూ!) ఆ జిగురు బాటిల్ ఇలా ఒకసారి పట్టుకొని రావయ్యా!

* * *

ఒకడు: నాకు పొత్తిగా నిద్ర పట్టడం లేదండీ!

డాక్టర్: (పొట్లం అందిస్తూ) ఈ మాత్రలు అరగంటకొకసారి ఒక మాత్ర చొప్పున వేసుకొని కాసిని మంచినీళ్లు తాగి పడుకోండి.

ఒకడు: ఒకవేళ నిద్రపడితే అరగంటకొకసారి గడియారానికి అలారం పెట్టుకోమంటారా?

ఎల్. వెంకటేశ్వర్లు

# అనుకోని అదృష్టం

ముద్దంశెట్టి హనుమంతరావు

గదిలో కుడివేపు గోడను ఆనుకొని రెండు సోఫాలూ, యెడమ వేపు నాలుగు కుర్చీలూ, వుంటాయి. సోఫాలకి యెదురుగా గుండ్రని చిన్న టేబులు వుంటుంది. గోడలకు దేశనాయకుల ఫోటోలు వేలాడదీసి వుంటాయి. ఒకసోఫాలో వసంత కూర్చుని కూనిరాగాలు తీస్తూవుంటుంది. బయట్నించి ఎవరో 'ప్రభాకర్! ప్రభాకర్!' అని పిలుస్తూవుంటారు. వసంత సోఫాలోంచి లేచి కుర్చీలమధ్యగా త్రోవచేసుకునిపోయి 'లేరండి' అని చెప్పేసివచ్చి మళ్ళీ సోఫాలో కూచుని కూనిరాగాలుతీస్తుంది...

ప్రభాకరం: (కాస్సేపు పోయాక వస్తూ) ఏమిటి చెల్లాయ్, మహా ఆనందంగా వున్నావే?

వసంత: (లేచి) ఎప్పుడు మాత్రం లేదన్నయ్యా! నీలాంటి అన్నయ్యవుండగా నాకు ఆనందానికేం కొదవ? (నవ్వుతుంది)

ప్రభా: అబ్బో! మాటలు నేర్చావు చెల్లాయ్! సరేగాని, నాన్నగారు యింకా రాలేదా?

వసంత: లేదన్నాయ్...కాని, మీ స్నేహితుడువచ్చి నిన్ను పిల్చాడు.

ప్రభా: ఎవరు? రమణమూర్తేనా?

వసంత: ఔను...

ప్రభా: నేను వచ్చేవేళ అయ్యిందిగా! కూర్చోమన లేకపోయావూ!

వసంత: ఆయన బయటనుంచేపిల్చి వెళ్ళిపోయాడు. లేకపోతే మాత్రం...(సిడియపడుతూ) ఎలావుండమనగలను?

ప్రభా: (నవ్వి) పిచ్చిపిల్లా! చదువుకున్నావన్నమాటేగాని పాతపద్ధతులు యింకా విడిచిపెట్టలేవు. సరే...నేనలా వెళ్ళొస్తాను. నాన్నగారొస్తే చెప్పు.

వసంత: మరి, కాఫీతాగవా యేమిటి?

ప్రభా: ఉహూ! ఇప్పుడే నా స్నేహితుడు కలిస్తే, హోటల్లో కాఫీసేవించక తప్పిందిగాదు. (రెండడుగులు వేస్తాడు)

రామబాబు: (ప్రవేశిస్తూ) ఎక్కడికిరా?

ప్రభా: అలా రమణమూర్తి దగ్గరకువెళ్ళాలనుకుంటున్నా నాన్నా!

రామ: చిన్నమాటుంది. కూర్చో (వచ్చి సోఫాలో కూచుంటాడు)

ప్రభా: (తండ్రికియెదురుగా కూచుని) ఏమిటి నాన్నా!

రామ: (వసంతకేసి తిరిగి) అమ్మాయ్! నాకో కాఫీ పట్రాఅమ్మా.

వసంత: అలాగే నాన్నా (నిష్క్రమిస్తుంది)

రామ: గోపాలంగారిని తెలుసుకదూ!

ప్రభా: హెడ్ గుమస్తా గోపాలమేనా?

రామ: ఔనురా

ప్రభా: ఆ! తెలుసు...అయితే ఏం?

రామ: వాళ్ళమ్మాయిని నీకిచ్చ్యాలని యేనాటినుండో అతని సంకల్పమట. వూరికే నాప్రాణాలు తీసేస్తున్నాడు. అతనిసంగతి నీకూ తెలిసిందిగాదూ. బాగా పరపతివున్న వాడు. రెండువేలు కట్నమిస్తాట్ట. వాళ్ళమ్మాయి కూడా బావుంటుంది లక్షణంగా. నేను చూశానే...నువ్వూ చూసేవుంటావు. వూరిలో సంబంధం...అన్నివిధాలా నా మట్టుకు బాగున్నట్టుంది. మరి నీయిష్టం...

ప్రభా: (చిన్నగానవ్వి) అవసరాలు యెంతటి వాళ్ళనయినా యిటే మార్చేస్తాయి సుమా నాన్నా! లేకుంటే గోపాలం లాంటి వ్యక్తి నీవెంట పడ్డం యేమిటి? ఇంతకు ముందెప్పుడన్నా నీతో మాట్లాడారా? ఇప్పుడవసరం వచ్చింది గాబట్టి యెంతో సన్నిహితంగా తిరుగుతున్నారు. అయినా నాన్నా, యిప్పుడు నాపెళ్ళికేం తొందరొచ్చింది చెప్పండి. చెల్లాయి పెళ్ళి ముందు కానివ్వరూ.

రామ: అదీ జరుగుతుందిరా అమ్మాయిని యెక్కడికో పై వూరివ్వటం నాకు యిష్టం లేదు, (కొస్సేపు ఆగి బాధగా) మీ అమ్మ చనిపోయాక అమ్మాయిని యెంతో ముద్దుగా పెంచాను. అదేమిటో దాన్ని దూరం పంపటానికి నామనసొప్పటంలేదు. గోపాలం దాని కోసం కూడా మంచి సంబంధం చూస్తానన్నాడు నువ్వు ఒప్పుకున్న పక్షంలో.

ప్రభా: (నవ్వి) బావుంది...గోపాలం గారు పెళ్ళిళ్ళ పేరయ్య బిరుదు వహించబోతున్నారన్న మాట! ఒకవేళ నేను ఒప్పుకోపోతే చెల్లాయికి సంబంధం మానేదన్నమాట. అంతా స్వార్థం!

రామ: మనలో మనం అనుకుందాం... కొస్తయినా స్వార్థం లేనిదే యెవరన్నా యెందుకు శ్రమ తీసుకుంటారు చెప్పు? అందులోనూ యీ కలికాలంలో...

ప్రభా: (చప్పున అందుకుని) అందులోనూ గోపాలం లాంటి వ్యక్తులు. సరేలెండి నాన్నా. నన్ను బాగా ఆలోచించుకోనియ్యండి చప్పున వున్నపాటున చెప్పేయమంటే యెట్లా? ఇదేం బొమ్మల పెళ్ళి కాదుగా!

రామ: దానికేముంది! ఆలోచించుకోరా! బహుశా ఆయన రేపు సాయంత్రం మనింటికి వస్తాడేమో!

ప్రభా: అలా చెప్పండి... నేను మొదటే అనుకొన్నాను యింటికి రావటం లేదేమా అని...అవసరం అన్న పదానికి వుండే లక్షణాలే అవి. అన్నట్టు కంట్రాక్టరు వాసుదేవరావుతో రమణమూర్తి గురించి మీరు మాట్లాడతానన్నారు...ఏమయ్యింది.

రామ: మాట్లాడాను...ఆయన ప్రస్తుతం యేం సహాయం చెయ్యలేనన్నాడు కొన్నాళ్ళుపోయాక కలవమన్నాడు.

ప్రభా: అన్నట్టు గోపాలంగారు హెడ్ గుమస్తా కదా అతి నేర్పుగా సహాయం చెయ్యగలడేమో! పాపం వుద్యోగం లేక మూర్తి రోజుకి రోజూ మరీ దిగజారి పోతున్నాడు నాన్నా!

రామ: నాకు మాత్రం తెలీదూ గోపాలం గారితో కూడా ఓమారు అని చూశాను. ఇప్పుడేం అవకాశాలు లేవనేశాడు.

ప్రభా: ఉహూ! సరే.. వస్తాన్నాన్నా.

(ప్రభాకరం యెడమ వేపు వెళ్ళిపోతాడు. అప్పుడే వసంత కుడివేపునుంచి కాఫీ తెచ్చి తండ్రికి అందిస్తుండగా)

తెర

## 2 వ. రంగం

[సుబ్బారావు గారిల్లు...గది యేమంత శుభ్రంగా వుండదు. ఓమూలగా పాత టేబిలు, మీదగుడ్డలేకుండా వుంటుంది. దానిమీద నాలుగైదు పుస్తకాలు, ఓ పాత అలారం టైంపీసు వుంటాయి. సుబ్బారావు పాత బడిన వాలు కుర్చీలో కూర్చుని వుంటాడు. అతని మొహంలో దీనత్వం వుట్టిపడు

తోంది. రమణమూర్తి లోపల్నుంచి అగది లోకి వచ్చి మడమలు అరిగిపోయిన చెప్పులు తొడుక్కుంటూ బైటికి పోతూవుండగా]

సుబ్బా: అబ్బాయ్...

రమణ: ఏం నాన్నా (వెనక్కి తిరుగుతాడు)

సుబ్బా: నీ వుద్యోగం విషయం ఏమయ్యిందిరా?

రమణ: నేనుమాత్రం యేంచెప్తాను? ఒకవేపు మీరు ప్రయత్నిస్తున్నారు. నేను కాళ్ళరిగిపోయేలా తిరుగుతున్నాను. అటు ప్రభాకరం, వాళ్ళ నాన్నగారు కూడా ప్రయత్నిస్తున్నారు. కాని నా అదృష్టం పండలేదు.

సుబ్బా: (విచారంతో) నిజంగా, మన రోజులేం బావుండటంలేదురా. నువ్వయినా యేంచేస్తావు? రోజుకిరోజూ నాకు సమస్యలు అధికమై జీవితం నిండా రోతపుడుతోంది కూడాను. ఇంత పెద్దకుటుంబం... నాఒక్కడి సంపాదన...... ఏంసరిపోతుందీగడ్డురోజుల్లో? ఎంతని అప్పుచెయ్యటం? మనకు తీర్చేతాహతువున్నా, లేకపోయినా, యిచ్చేవాళ్ళుండాలిగా! ఏదో నువ్వు చేతికి అందివచ్చావనుకుంటే నీసరికి వుద్యోగం దొరకటం రాజపదవిదొరికినంత దుర్లభంగా వుంది. ఏమిటోఅంతా?

రమణ: (చిన్న బుచ్చుకొని) ఏంచెయ్యను నాన్నా! నాకూ యెంతోబాధగావుంది... ఇంత చదువు చదువుకుని యెందుకూ వుపయోగపడాను కాదుకదా అని...రోజంతా యిక్కడా అక్కడా, తిరగలేక చస్తున్నా. ఎవరు ఓకాస్త ఆశచూపించినా, అక్కడికి వాళ్ళు మళ్ళీ లేదనేవరకూ తిరుగుతూనే వున్నా అభిమానం చంపుకుని.

సుబ్బా: నేనుమాత్రం కాదంటున్నానా? నువ్వు అన్నివిధాలా ప్రయత్నిస్తున్నావు. ఫలించకపోవడం మన దురదృష్టం (ఆగి) మన ప్రభాకరం నాన్నగార్నే పట్టుకోరా! నేనూ ఓమారు వెళ్ళి చెప్పాలనుకుంటున్నాను...ఆయనకి యీవూర్లో మంచి పరపతివుంది.

రమణ: అలాగేనాన్నా.

[ప్రభాకరం ప్రవేశిస్తాడు]

ప్రభా: (వస్తూ) నమస్కారమండీ!

సుబ్బా: నమస్కారమోయ్! రా, కూర్చో...నీ విషయమే ప్రస్తుతం అనుకుంటున్నాం. మీనాన్నగారితో చెప్పి మావాడికేదైనా వుద్యోగం వేయించమూ నీ పుణ్యముంటుంది.

ప్రభా: మీరు చెప్పాలా! ప్రయత్నిస్తూనే వున్నాం......దేనికైనా ఆరోజు రావాలిగదండీ!

సుబ్బా: ఆమాట నిజమే మరి!

ప్రభా: ఏరా, మూర్తీ! మాయింటికి వచ్చావటకదూ! కాస్సేపు కూర్చోలేక పోయావూ!

రమణ: నాకు కాస్త పనుండటంవల్ల వచ్చేశాను.

ప్రభా: సరేలే...అలా వెళ్దాం పద.

రమణ: కాస్సేపు కూర్చోరా పోదాం.

సుబ్బా: అబ్బాయ్...మీ అమ్మకుచెప్పి కాఫీచేయించి పట్రా.

ప్రభా: అక్కర్లే వద్దండీ! ఇప్పుడే కాఫీ తాగాను. అంతకీకాదంటే, యీసారి వచ్చేప్పుడు పుచ్చుకుంటాలెండి. పదరా మూర్తీ! వస్తామండీ.

సుబ్బా: మంచిది నాయనా!

[ప్రభాకరం, రమణమూర్తి, వెళ్ళిపోతారు]

## 3 వ. రంగం

(రంగస్థలం: మొదటి రంగమే...)

ప్రభా: ఏమిటోనాన్నా! రమణమూర్తిని చూస్తూంటే, నాకు అదోలాంటి జాలిపుడుతోంది. వాడూ, నేనూ ఒకేసారి చదువు పూర్తిచేశాం...నాకు వుద్యోగం దొరికింది గాని, వాడికి దొరకడంలేదు.

రామ: దానికి మనమేంచేస్తాం రా! మనంకూడా శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తూనే వున్నామాయె...నాకూ జాలిగానే వుంది వాళ్ళని చూస్తే! ఇప్పుడంటే, యిలా దూరపు బంధువులమై పోయాంగాని, మొదట్లో - అంటే మూడు తరాలముందు వాళ్ళూ మనం, యెంతో సన్నిహితులమని మానాన్న చెప్తుండేవారు. మొదట్లో వాళ్ళకే బాగా ఆస్తివుండేదట కూడాను. కాలం మార్పుతో వాళ్ళకుటుంబ పరిస్థితులుకూడా మారిపోయాయి పాపం!

ప్రభా: (జాలిగా) నిన్న వాళ్ళింటికి వెళ్ళినప్పుడు తండ్రీ కొడుకూ మాట్లాడుకుంటుంటే, ఎందుకోమరి నాకు వినాలని బుద్ధిపుట్టింది. వాళ్ళనాన్న ఎంతోబాధతో యేమిటేమిటో చెబుతుంటే, నిజంగా నా హృదయం ద్రవించిపోయింది నాన్నా.

రామ: (ఆలోచనగా) ఎవరికైనా అప్పట్లో ఆ అనుభూతి కలుగుతుందిరా! ఏంచేస్తాం? ఈ వేళ గోపాలంగారు వస్తామన్నారు గదా...అతనితో రమణమూర్తి విషయం మళ్ళీ ఎత్తిచూస్తాను...

ప్రభా: మరోమాట మీతో చెప్పాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నా...

(32-వ పేజీ చూడండి)

రచయిత

నాటకాల్లో అనేక తమాషా సన్నివేశాలు వస్తూంటాయి. వాటిసంగతి ప్రేక్షకులకు అట్టే తెలియదు. తెరలోపల వుండే నటవర్గానిక్కీ, తెర ఎత్తిన తరువాత రంగస్థలం మీద ఉండే నటవర్గానికీ వాటిమజా తెలిసి నవ్వును వాళ్ళల్లో వాళ్ళే నవ్వుకుంటూంటారు.

1930 లో మేము ఏలూరులో ఒక నాటక సమాజం స్థాపించాం. సభ్యులంతా కుర్రకారువాళ్ళే, అందరూ పరీక్షతప్పిన విద్యార్థులే. అగ్రతాంబూలం అధ్యక్షులవారిది. వారు స్కూలుఫైనలు సెకెండ్ సంవత్సరాలలో కలుపుకుని దశప్రయత్నం చేసుకుందామని ఉబలాటపడేవారు. కాని వారి చిరకాల వాంఛితం ఈడేరనే లేదు. కారణం కంపెనీలో వారిని మించినవాళ్ళు నూతనంగా ప్రవేశించి, వారితో పోటీ పడ్డారు.

నాటకాల్లో వేషం వెయ్యడానికి ప్రవేశ పరీక్షలుగాని, సర్వీసు కమీషనవ్ పరీక్షలుగాని లేవుగదా! కొత్త దరఖాస్తు రాగానే, మాలో ముగ్గురం కూర్చుని, దరఖాస్తుదారుని ప్రశ్నించేవాళ్ళం. మొదటి ప్రశ్న "నీవు ఎంతవరకు చదువుకున్నావ్?"— "దర్డుఫారం తప్పానండి!" అంటే 30 మార్కులు వేశేవాళ్ళం. అనగా 30 కి 20 అన్నమాట. రెండవ ప్రశ్న: భారత భాగవతాల్లో పద్యాలు, అర్థంతో కొన్ని అయినా వచ్చునా? జవాబు: "భారత భాగవత పద్యాలు రావండి. ఉద్యోగ విజయంల్లోని "జెండాపై కపిరాజు" వగైరాలు 20 పద్యాలు వచ్చునుకొని. అర్థాలు తెలియవండి!" అని వస్తే, 30 కి 25 మార్కులు పుంజుకున్నాడన్నమాటే! మూడవప్రశ్న: "నీవు ఏఉద్యోగమైనా చేస్తున్నావా?" "లేదండి. ఆ ప్రయత్నంకూడా చెయ్యను. అస్వతంత్రంగా బ్రతకటం నాకు గిట్టదు!" అని జవాబువచ్చిందా, "సెహబాస్ పరీక్షలో నెగ్గినట్టే! మరునాడు వేషాలపట్టికలో అతని పేరు నమోదు అయ్యేది.

అట్టి దరఖాస్తులు ఆమోదింపబడ్డ వారిలో నారాయణమూర్తి, రాఘవరావు, అని ఇద్దరుండేవాళ్ళు. ఇద్దరికీ చెముడే! పందెం వేసుకుని నాకు వినపడదంటే, నాకు వినపడదనే వారు! మధ్యవర్తులు "ఏలూరు జ్యూట్ మిల్లు కూత పర్లాంగు దూరంలో ఉన్నా ఎవరికి వినపడదో, వారు గెల్చినట్టు అన్నారు. రామాయణం నెత్తినపెట్టుకుని ప్రమాణంచేసి అంతా నిజంచెప్తా, అబద్ధంచెప్పను అనాలి. ఇద్దరూ వినపడలేదన్నారు ఆఫిడవిట్టు ఇస్తూ. మాజావాణీ లెండి! మరి పందెగజాలు ముందుకువెళ్ళి వినమన్నారు. ఒకడు ఏదో హోరుగా వినపడ్డదనిసంశయంతో చెప్పాడు. రెండోవానికి రైల్వేగార్డు ఈలలాగున లీలగా వినపడ్డదట! నాన్ బధిరులకు ఆకూత 6 మైళ్ళు వినపడుతుందని ప్రతీతి.

## చెవిటి మాలోకం

వీరిద్దరూ సారంగధరనాటకంలో వేషాలు వేస్తామని ఉబలాట పడుతూండేవారు. డైరెక్టరు నేనుగనుక, వారిద్దరిలో, నారాయణమూర్తికి ఉద్దండుడు అనే పేరు వేషం, రాఘవరావుకు జాతవేదుడు అనే సాక్షివేషం ఇచ్చాను. ఆ నాటకంలో నేనే రాజరాజు పాత్రధరించాను. నాటకంలో ప్లీడరుగారు, సాక్షిని కొన్ని ప్రశ్నలు అడుగుతాడు. మొదటిప్రశ్న: 'జాతవేదా నీవయస్సు ఎంత?' జవాబు 60 సంవత్సరములు. రెండవ ప్రశ్న: 'నీవు చిత్రాంగి కొలువులో ఎన్ని సంవత్సరములనుంచి ఉంటివి?' జవాబు: '8 సంవత్సరములనుంచి.' "మీరు చెవిటివాళ్ళు, ప్రాంప్టింగు అందదు—పోర్షన్ క్షుణ్ణంగా చదవమని చెప్పనే చెప్పాను.

# నాటకంలో అంతర్నాటకం

తెర వెనకా తెర ముందూ తమాషాలు

శ్రీ బందా కనకలింగేశ్వరరావు

వాళ్లూ బాగానే అప్పచెప్పారు. ఇద్దరూ వరుసగా ప్రశ్నలూ, వరుసగా జవాబులూ బట్టీ పెట్టారు.

నాటకం ప్రారంభం అయికోరు సీనుకు వచ్చాము. నేను రాజరాజుగా కూర్చున్నాను. నారాయణమూర్తి ప్లీడరువేషం కోసం దుగ్గిరాల ప్లీడరుగారినడిగి, నల్లకోటు జరీపాగ తెచ్చుకుని ధరించాడు. వేషం బాగానే ఉందిగాని, మొఖం మాత్రం ప్రాక్టీసు లేని ప్లీడరులాగున్నది.

రాఘవరావు సాక్షిగా ఖద్దరు కాలువ తలకుచుట్టి బోనులో నిల్చున్నాడు. ఇద్దరూ మొఖమొఖాలు చూసుకుని ప్రేక్షకుల మొఖం చూడలేక, ముచ్చెమటలుపోసి నిల్చున్నారు. నారాయణమూర్తి సాక్షిని ప్రమాణం చెయ్యమన్నాడు. రాఘవరావు ప్లీడరు గుమాస్తా నేర్పుకుంటున్న బాపతు. కనుక ధారాళంగా నారాయణమూర్తి చెప్పేది వినిపించినా వినిపించకపోయినా, ప్రమాణం చేసేశాడు. ఆ ఘట్టం అయింతర్వాత, నారాయణమూర్తి లేచి, సాక్షిని ప్రశ్నించడంలో కొంచెం పొరపాటుపడి, "నీవు చిత్రాంగి కొలువులో ఎన్నాళ్ళుంటివి?" అని రెండవ ప్రశ్న మొదటి ప్రశ్నగా వేశాడు. ప్లీడరుగారి ప్రశ్న ఎలాగూ వినిపించదు గనుక, జవాబులు వరుసగా బట్టీ పెట్టిన రాఘవరావు క్రమప్రకారం "అరవయియేళ్ళు" అన్నాడు. ఇది నారాయణమూర్తికి అసలే వినిపించలేదు గనుక, రెండవ ప్రశ్నగా "నీవయస్సెంత?" అన్నాడు. ధైర్యంగా తడుముకోకుండా రాఘవరావు 'మూడు సంవత్సరములు' అని దబాయించి చెప్పాడు. నాకు నవ్వాగటం లేదు. ప్రేక్షకులు గొల్లుమని నవ్వారు. వీళ్ళిద్దరూ ఒకళ్ళ మొఖం ఒకళ్ళు చూచుకుని, తమ నటనకు ప్రేక్షకులు ముగ్ధులౌతున్నారనుకొన్నారు. అంతటితో నారాయణమూర్తి ఆర్గ్యుమెంటు మొదలుపెట్టారు. ప్రేక్షకులు మరీ నవ్వు



ఫ్యాక్టరీకరాత పరీక్ష

కున్నారు. నేను మెల్లగా అతనితో 'ఇక ఆపు' అన్నాను. నారాయణమూర్తి అదరిపడి "బిగ్గరగా చెప్పమంటావా?" అని మరీ బిగ్గరగా అరుస్తూ చెప్పనారంభించాడు. ఇక చేసేదిలేక, తెర దించమని లోపలికి కనుసైగ చేశాను. తెర దించారు.

## మీసం చేసిన మోసం

తరువాత రంగం చిత్రాంగి ప్రేమకలాపం ఎల్లాగో అల్లా జరిగింది. రత్నాంగి సారంగధరుల రంగం వచ్చింది. సారంగధరుడికి చిత్రాంగిరంగంలోనే అనుమానం తగిలింది, తన పురుషత్వాన్ని సూచించే మీసాలు కదలబారాయని! ఎల్లా. మధ్యలో ఎడమ చేత్తో ఒత్తుకుంటూ, పద్యాలు వదుల తప్పకుండా, నోరు నొక్కుకుంటూ, ఒక్క విసురు విసిరి రంగం పూర్తి చేసి లోపలకెళ్ళాడు. ప్రసన్నులనాడిమీద మండిపడ్డాడు, మీసాలు అంటించే 'గమ్' (జిగురు) మంచిది కాదని. వాడు మీసాలకు పైన, లోపల, అన్ని ప్రక్కలా దట్టంగా జిగురు పట్టించి, దబాయించి మళ్ళీ అంటించాడు.

తర్వాత రంగంలో రత్నాంగి కాలితో తాళం వేస్తూ 'తనయా' అని కీర్తన పాడుకుంటూ వచ్చింది. ఎదుటవున్నా సారంగధరుడికోసం ఎంతసేపో సంగీతంలో విలపించి, విలపించి, గట్టిగా సారంగధరుని కౌగలించుకుని పద్యంతో వీడ్చింది. సారంగధరుడు కూడా 'అమ్మా, అమ్మా!' అంటూ ఆమె కౌగిలిలో వాపోయాడు. తలపులు విడదీశారు. విడదీయగానే జనం గొల్లుమన్నారు! మాకేం తెలుసు కారణం? గబగబా పరుగెత్తి కళ్ళి ప్రక్కలనుంచి చూశాం. ఇంకేముంది. సారంగధరుడి మూతిమీసాలు రత్నాంగి రొమ్ములమీదికి ట్రాన్స్ఫరు అయినాయి! వారిరువురికీ ఆ మార్పులు తెలియక తికమకపడుతున్నారు. "రండి! రండి!" అని కేకలు వేశాం. తెర బలవంతాన దించి, ఆ రసాభాస సర్దివేశాం.

# ★ నాటకంలో అంతర్నాటకం ★

ఇక్కడికి ఈ నాటకం ఇలా అయింది.

## లేని మీసాలు: ఉన్న నత్తి

మళ్ళీ నెలలో సమాజంవారం అందరము పోగయి "ఉద్యోగ విజయాలు" ఆడాలని తీర్మానించాం. వేషాల్లో పేచీలువచ్చాయి. అందరినీ ఎలాగో సమాధానపరిచాం; కాని కృష్ణమూర్తికిమాత్రం వేషం కుదరలా. మా ఇంటికివచ్చి నన్ను దుమ్మెత్తిపోశాడు. విధిలేక జాబాలివేషం ఇచ్చాను. విగ్రహంలో ఒడ్డూ పొడుగూఉన్నవాడే, కాని కొంచెం



జాబాలి దిమ్మ తిరిగింది!

నత్తి అతనికి. వేషంమీద నత్తిరాదని అతని వాదం. ఉత్తప్పుడు ఉన్నది ఎలా పోతుంది అని వాదించాం. అతను అంటాడూ "ఉత్తప్పుడు లేనివి (మీసాలు వగైరా) నాటకంలో రావటంలేదా! అలాగే ఉన్నవి పోతాయి, లేనివి వస్తాయి" అని. సరే కానిమ్మన్నాం. బెజవాడనుంచి 'రంగమార్తాల' వెంకటేశ్వరరావును గాంధారికిపిలిపించాం. నెలరోజులు ప్రాక్టీసుచేశాం. నాటకం లేపనగా మెంబరు కాంప్లిమెంటరీకోసం బాధించడానికి మొదలుపెటారు. అవి ఆఫీసర్లకుగాని ఇతరులకివ్వకూడదని తీర్మానించుకున్నాం. కృష్ణమూర్తి (జాబాలిగాడు) ఎలాగయినా ఇవ్వమని పట్టుపట్టాడు, వాడి భార్యా, వెధవ మేనత్తా, మరదలూ చూడాలని. ఆఖరికి టిక్కట్లుకొనుక్కున్నాడుపాపం, తన వేషం వాళ్ళకి చూపించాలని. తనదాబు, దౌలు, దర్పం వాళ్లు చూడాలని వాడికోర్కె.

అంతా రంగస్థలు వేసుకుంటున్నాం. కృష్ణమూర్తి మాట పట్టించుకునేవాడు లేడు. రహస్యంగా రంగుల సుబ్బయ్య చేతిలో రూపాయి పెట్టాడు. మా అందరికన్నా సుబ్బయ్య వాడికి ముందు వేషంవేసి, చమ్కీకోటు, చమ్కీలాగు, తలపాగా చుట్టి అద్దంలో చూసుకోమన్నాడు. నేను పిలిచి సుబ్బయ్యను చీవాట్లు పెట్టాను. "జాబాలి ఋషిరా!" అని. కాసాయ వస్త్రాలు కట్టుకున్నాను. ససేమిరా వీల్లేదు అన్నాడు కృష్ణమూర్తి. ఆఖరికి ఇద్దరం రాజీపడి, గడ్డం కట్టుకోడానికి ఒప్పందు చేట్లు చేశాను. సుబ్బయ్య పొడుగుపాటి తెల్లటిచుగడ్డం, కృష్ణమూర్తికి బిగించి కట్టాడు, మాటరాక కృష్ణమూర్తి తడుముకొని వదులు చేయమని సుబ్బయ్యను బ్రతిమలాడాడు. వదులుచేస్తే నత్తి వస్తుందని సుబ్బయ్య సర్ది చెప్పాడు. విధిలేక కృష్ణమూర్తి గడ్డం ధరించి, తొలితెర కన్నాల్లోంచి తన భార్య వచ్చిందేమో చూశాడు. వచ్చింది. పెహాబాస్ అనుకుని ప్రక్కనేవున్న తాయిఖానా దొడ్లో పద్యం వల్లెవేస్తున్నాడు. "ఒక్కని జంపునంచు తెరుహాలాతు డొసంగిన" అనే పద్యం అది. గడ్డం బిగించికట్టడంవల్ల మాట పెగలక "ఒక్క ... ఒక్క ... ఒక్క ... ఒక్క..." అని అనుకుంటున్నాడు.

పైమాట రావడంలేదు! భీముడివేషం పార్వతీశం కట్టాడు. అతనికి సరిగ్గా ఆవేళకు బయటికి వెళ్ళవలసివచ్చింది. కొంచెం రేచీకటి ఉందతనికి. తడుముకుంటూ గద చేత్తో పట్టుకుని దొడ్డిదగ్గరకు వెళ్లి లోపలకు కాలు పెట్టబోతున్నాడు. ఆరోజుల్లో ఎలక్ట్రిక్ లైట్లు హాలుల్లో ఇంకా బిగించలేదు. స్టేజికి గ్యాసు లైట్లు, నేపథ్యానికి హరికేన్ లాంతర్లూ ఉండేవి. బయట చీకటి తాండవంఆడుతూ ఉండేది.

## "ఒక్క...ఒక్క"

అసలే చీకటి, అందులో రేచీకటివాడు పార్వతీశం, దొడ్లో కాలు పెట్టేసరికి "ఒక్క.. ఒక్క" అనే శబ్దం వినవచ్చింది. ఇంకేముంది తిక్కమాలిన పందికొక్కు చిక్కనే చిక్కిందనుకొని చేతిలో వున్న గదతో శబ్దంవచ్చినచోట లగాయించి ఒక్క దెబ్బ వేశాడు! "అమ్మో" అంటు అరవబోయిన కృష్ణమూర్తి గడ్డం పటుక్కున తెగింది. మేమంతా హడలిపోయి లాంతరు తీసుకొని దొడ్డిలో కెళ్ళాం. పార్వతీశం పర్వతంలాగ గుమ్మానికడ్డంగా నిలబడి వణుకుతున్నాడు. అతణ్ణి తప్పించుకొని రంగుల సుబ్బయ్య లోపలికి వెళ్ళాడు. కృష్ణమూర్తి బావురుమన్నాడు. సుబ్బయ్య ఆసరా యిచ్చి "ఏమిటి కృష్ణమూర్తీ?" అన్నాడు. కృష్ణమూర్తి వదురూ బెదురూ లేకుండా 'గడ్డం తెగిపోయింద'న్నాడు. "నీగడ్డం పాడుబడ, దెబ్బతగిలిందట్రా?" అని పార్వతీశం అడిగాడు. "నాటకాలగదతో కొడితే నాకేం భయం? ఇంతకూ మా వెధవ అత్తగారు నన్ను కాపాడింద"న్నాడు కృష్ణమూర్తి. అదేమిటన్నాను నేను. సుబ్బయ్య అందుకుని: 'తలపాగ చుట్టింది వాళ్ల అత్తగారి గోవులపంచ-అదే అతనిని కాపాడింద'న్నాడు. మేం విరగబడి నవ్వుకుని అందరం లోపలికివచ్చి, కృష్ణమూర్తికి వేళ లగ్నం బాగుండలేదని వేషం వద్దన్నాము. వాడు మామీద మండిపడి: "పదిరూపాయల టిక్కట్లు కొన్నాను, మా వాళ్ళంతా వచ్చారు. చచ్చినా వేషం మానను. కావాలంటే మరింత బిగించి కట్టండి గడ్డం" అన్నాడు. ఇక చేసేదిలేకనూ, వాడు పది రూపాయలూ మళ్ళీ వాపసు అడుగుతాడని భయంచేతనూ 'సరే' అన్నాము.

## దిమ్మ తిరిగింది

నాటకం ప్రారంభించాము. ఎలాగా అల్లా కృష్ణుడిసీను గడచి పాండవులసీనులోకి వచ్చాం. జనం, మధ్యమధ్య నిజంగానో, హాస్యానికో తెలియదుగాని వన్సుమోర్లు అంటున్నారు. ఉత్సాహంగానే ఉంది. ఒక్క చిన్న ప్రమాదం ఘటుకు జరిగింది. పార్వతీశం, భీముడు వేషంవాడు

పద్యాలు దబాయించి చదువుతున్నాడు. ఒక పద్యం—మొదలు జ్ఞాపకంలేదు" ఆ!... 'అగ్రజాడంపుగాక' అనే పద్యం చదువుతూ గిర్రున గద తిప్పుతున్నాడు. కొంప మునిగింది! గద కఱ్ఱకు చివర పెట్టిన కొయ్య బొమ్మ గుండ్రనిది, ఊడి, గిరగిర తిరుగుతూ, హార్మోనిస్టు నెత్తిన పడ్డది. వాడు వెనక్కి ఒరిగి కుర్చీతోసహా కాంప్లిమెంటరీ టిక్కెట్టులో వచ్చిన కమీషనర్ గారి పిన్నత్తిగారిమీద పడ్డాడు! జనం గొల్లుమన్నారు. మా కార్యదర్శి క్షమాపణ అర్థించాడు. కమీషనర్ సకుటుంబంగా చిరచిరలాడుతూ హాల్లోంచి బయటికి వెళ్ళారు. గొడవ సర్దుకుంది. గదగుండు లోపలికి పట్టుకొచ్చారు. మళ్ళీ మేకువేసి బిగించాం.

## పద్యం పెగలలేదు

రాయబారం సీను వచ్చింది. అందరు ఆసీనులైనారు. కృష్ణమూర్తి జాబాలి వేషంతో వాళ్ళవిడకు బాగా కనపడేటట్టుగా, కుర్చీ ముందుకు లాగి కూర్చున్నాడు. 'రంగమార్తాండ' వెంకటేశ్వరరావు గాంధారీవేషంలో కళ్ళకు గుడ్డ కట్టుకుని కూర్చున్నాడు. సీను మొదలుపెట్టారు; సాగుతోంది. సలక్షణంగానే నడుస్తోంది. దుర్యోధనుడు తల్లిదండ్రులతో తన వాక్కులు స్థిరపరచుకొంటున్నాడు. వారు వింటున్నారో లేదో, ప్రేక్షకులు గ్రహించలేకుండా ఉన్నారు. కృష్ణమూర్తి పద్యం వస్తోంది. అతను ముందరి గడ్డం సడలుతుందో లేదో అని, పద్యం పెదవులకు వినపడకుండా ప్రయత్నిస్తున్నాడు; తీరా వచ్చింది. 'ఒక్క... ఒక్క' అంటాడేగాని మాటరాదు. గడ్డం చోటివ్వటంలేదు. విలంబన సహించలేక ఆ పక్కనే వున్న ద్రోణాచార్య వేషం కట్టిన సర్వయ్య ఆ పద్యం కాస్తా తానే చదివాడు. మార్పు ప్రేక్షకులకు తెలియదు. కృష్ణమూర్తి బాధ వర్ణనాతీతం; సర్వయ్యకూ, తనకూవున్న పూర్వ విరోధం ఈ విధంగా సర్వయ్య సాధించాడని ఉక్రోషం. ఎప్పుడు తెరపడుతుందా అని చూస్తున్నాడు. అతని ఇల్లాలు వగైరాల మొగం చూడలేకపోయాడు. వాళ్ళుమాత్రం విషయం తెలియక నాటకం చూస్తున్నారు.

## గాంధారి గాఢనిద్ర

దుర్యోధనుడు వరస పద్యాలు చదువుతూ తల్లిదండ్రుల కాళ్ళదగ్గర కూర్చుని తల్లిని 'అమ్మరో!' అని అడుగుతున్నాడు ఆశీర్వచనంకోసం. గాంధారి ఉలకలేదు, పలకలేదు! [illegible] చెప్పాలి. ఎంతసేపటికీ చెప్పదే! 'రంగమార్తాండం'కి కునుకుపట్టింది గాఢనిద్రలో ఉంది గాంధారి! ఎవరు లేపాలి? గాంధారిని ముట్టుకునే హక్కు ఎవరికి ఉంది! ఆమె మహాపతివ్రత! శపించగలదు! భర్త అంధుడాయెను. పైగా కన్నులుం లేన్నా, మూసుకుని, గజదూరంలో కుర్చీలో కూర్చున్నాడు. ఎవరివల్లం ఆమెను లేపడం? ఎవరు సాహసించాలి? ప్రాంప్టరు ఆమె కుర్చీ వెనకాలే కూర్చున్నాడు. అతనికిమాత్రం హక్కుంది. చిన్నగా తట్టాడు. గాంధారికి స్పర్శజ్ఞానం లేదు. వెంటనే కొంగు పట్టుకు లాగుదామనుకున్నాడు. ఇదంతా ప్రేక్షకులకు కనపడడం లేదు. అతను సాహసించి పైకొంగు పట్టుకున్నాడు! ఆ కొంగులో ఆమె తలముడి కూడా కలిసివచ్చి, సహకరించింది. ఒక్క లాగు లాగాడు. ఇంకేముంది! జనం గొల్లుమన్నారు. ఏమిటా అని మాతుముగదా! గాంధారి తలకట్టంతా ప్రాంప్టరు చేతిలోకి వచ్చింది! మొన్ననే తిరుపతినుంచి మొక్కు చెల్లించుకు వచ్చిన వెంకటేశ్వరరావు తలకాయ చలిమిడి ముద్దలా ప్రేక్షకులకు ప్రత్యక్షమైంది. 'బోడి గాంధారో!' అని కేకలు మిన్ను ముట్టాయి. రంగమార్తాండానికి మెలకువ వచ్చింది కాని మగత విడలేదు. ఆ మగతలో తెల్లవారిందనుకొని 'ఇడ్లీ సాంబారు!' అని ఒక కేక పెట్టాడు. హాలు చెక్కలైంది. ప్రేక్షకులకు చేసేది లేకనూ, అదివరకే తొందరగా ఉండటంవల్లనూ కృష్ణమూర్తి లోపలకు గంతి తెరదించాడు. గాంధారిని పూర్తిగా మేలుకొలుపుతున్నాం మేం.

"బోడి గాంధారి"

## గ్రీన్‌రూంలో దొమ్మీ

ఇంతలో ఢమ్ ఢమ్ అని గుద్దులు వినిపించాయి. ఒక ప్రక్క సర్వయ్యా, కృష్ణమూర్తి దెబ్బలాడుతున్నారు. విడదీశాం. 'నా పద్యం చదవడానికి నీకేం హక్కు?' అని సర్వయ్యతో చేతులు కలుపుతున్నాడు. 'నా భార్యకోసం రిజర్వుచేసిన సీటులో వీడి వెధవ అత్తగారిని కూచోబెట్టాడు, రోగం కుదుర్చానన్నాడు సర్వయ్య. గ్రీన్‌రూములో హార్మోనిస్టు ఉగ్రనారసింహ స్వరూపంతో, భీముడిమీద విరుచుకుపడ్డాడు, గదను నిర్లక్ష్యంగా త్రిప్పినందుకు! వెంకటేశ్వరరావూ ప్రాంప్టరూ వొడ్డో దెబ్బలాడుతున్నారు. తగాలు తీర్చడం నావంతు. తెల్లవారింది. విసయింది. ప్రేక్షకులు ఎప్పుడో వెళ్ళిపోయారు. కలెక్షన్ ఇరవై ఒక్క రూపాయల పావలా పట్టుకుని వచ్చాడు కార్యదర్శి. అందులో పదిరూపాయలు కృష్ణమూర్తి పద్యం తప్పించినందుకు దెబ్బలాడి వాపస్ తీసుకున్నాడు. లైటు ఆడివాళ్ళు, డప్పులవాళ్లు మిగతా సొమ్ము కాజేశారు. మాకు మిగిలింది మూడురూపాయలు మాత్రం. చిల్లర మార్చటానికి వెళ్ళి 'ఆంధ్రపత్రిక' పట్టుకొచ్చాడు కార్యదర్శి. పేపరు మా స్టేషనికి రిజల్సు వచ్చాయి; నేను ప్యాసయినాను. టీపార్టీ చేద్దాం అన్నారు. పొద్దున్నే టీకద్దు ఇడ్లీన్నా, పెసరట్ల పార్టీ అన్నారు. మూడు రూపాయలూ పెట్టి మాతృభూమిఅయ్యరు హోటలునుంచి సరుకు తెచ్చారు. రాత్రంతా మేలుకున్నాం గనుక మొఖం కడగనక్కరలేదని తీర్మానించాం. దంతో మంతో ఫలహారాలు ఆరగించాం. కార్యదర్శి అభ్యర్థులను మాట్లాడుతున్నాడు. అయినా, నే పాసయినందుకు సంతోష తీర్మానం ప్రకటించాడు. ఆ దేమిటన్నారు కొందరు. ప్యాసయినవాళ్ళకి సభ్యత్వం పోతుంది. ఇకనుంచి ఇతగాడు మన సమాజంలో కాలుపెట్టడానికి అర్హత లేదన్నాడు. విచారంతో వీడ్కోలిచ్చారు. మళ్ళీ నాకు ఆ సమాజంలో సభ్యత్వం లభించలేదు నాటికీ నేటికీ— ★



# అనుకోని అదృష్టం



(27- పేజీ తరువాయి)

రామ : ఏమిట్రా?

ప్రభా : రమణమూర్తి అంటే, మీకు ఎలాంటి అభిప్రాయముంది?

రామ : ఎందుకలా అడుగుతున్నావు?

ప్రభా : ఊరికనే... చెప్పండి.

రామ : అబ్బాయి మంచివాడు... తెలివైనవాడు... పెద్దలంటే అమిత గౌరవం చూపిస్తాడు.

ప్రభా : ఔనుకదా మరి! మీరు కోపగించుకోకండి... వాడికి మన వసంతనిచ్చి... (నమిలేస్తాడు మాటల్ని.)

రామ : (చప్పున అందుకుని తీక్షంగా కొడుకు వేపు చూసి) పెళ్లి చెయ్యమంటావు? ఏం? (ఆగి) బాగానే వుందిగాని, బొత్తిగా మన తాహతుకి వ్యతిరేకమైన సంబంధం!

ప్రభా : మీరూ అలా అంటే ఎట్లా నాన్నా? వ్యక్తి గుణగణాలకంటే డబ్బే ప్రధానమా? వాడికి ఏదో ఉద్యోగం అవుతే వాడి బ్రతుకు వాడు బ్రతక్కపోతాడా? చెల్లాయి యీ వూళ్లో మనకళ్లముందే వుంటుంది. ఏమంటావు నాన్నా?

రామ : ఏమంటాన్రా! నిక్షేపమైనపుడు నాకేం? రమణమూర్తిపై నాకు సదభిప్రాయమే వుందిగాని, అమ్మాయి ఒప్పుకుంటుందో లేదో?

ప్రభా : (చిరునవ్వుతో) చెల్లాయి ఒప్పుకుంటుందని నాకు బాగా తెలుసు.

రామ : (వింతగా) ఎలా తెలుసురా?

ప్రభా : ఎప్పుడన్నా రమణమూర్తి ప్రస్తావన వచ్చిందంటే, చెల్లాయి యెంతో ఉత్సాహం చూపుతుంది నాన్నా! వాడు రాసే కథల్ని చదివి యెంతో మెచ్చుకుంటుంది. అంతకీ కాదంటే, మీరో మాట అడిగి చూడండి.

రామ : సరేలేరా.

గోపా : (ప్రవేశిస్తూ) నమస్కారమండీ దాసుగారూ!

రామ : రండి రండి. మీకోసమే కాచుక్కూర్చున్నా.

గోపా : (నవ్వి) అబ్బాయికూడా వున్నట్టున్నాడే...



ప్రభా : నమస్కారమండీ! (నిల్చుంటాడు.)

గోపా : నమస్కారమోయ్... కూర్చో కూర్చో....

రామ : అబ్బాయ్... వెళ్ళి అమ్మాయితో చెప్పి కాఫీ తీసుకురమ్మను.

గోపా : అబ్బే! వద్దులేవోయ్... యిప్పుడే కాఫీ తాగాను.

ప్రభా : (నవ్వుతూ) అలా అనటం పరిపాటేలెండి. (నిష్క్రమిస్తాడు.)

గోపా : అవుతే దాసుగారూ! అబ్బాయి ఏమంటున్నాడండీ! ఒప్పుకున్నట్టేనా?

రామ : ఈ కాలం కుర్రాళ్లు కదండీ — ఆలోచించి చెప్తానంటున్నాడు. మనం వేరు, మన కాలం వేరూను; ముఖాముఖిగా మీరే అడిగేయండి. అప్పుడు వాడే చెప్తాడు.

[ప్రభాకరం కాఫీ తెచ్చి గోపాలంకి అందిస్తాడు]

గోపా : (కాఫీ త్రాగి) అవుతే ప్రభాకరం—యేమిటోయ్ నీ అభిప్రాయం?

ప్రభా : ఆలోచించనీయండి మరి!

గోపా : అదిగో! అల్లాంటి జవాబులే నాకు నచ్చవు. ఆలోచించటానికిందులో యేముందోయ్ ... అమ్మాయిని నువ్వు చూసే వుంటావు... నాన్నగారు మావాళ్ళు... తతిమా విషయాలన్నీ తెలిసినవేను ... మరింక ఆలోచించటం దేనిగురించీ అంట? (ఖాళీ కప్పును కింద వుంచేస్తాడు).

ప్రభా : ఒక చిన్న షరతుంది...

గోపా : (ఉలిక్కిపడి) ఏమిటోయ్... కనీ వినని షరతులేమన్నా తెచ్చిపెడుతున్నావా యేమిటి?

ప్రభా : మరేమీ లేదులెండి... నా స్నేహితుడు, బంధువూ ఒకాయనున్నాడు. అతనికి వుద్యోగం చేయించాలి ... మొన్నే ఫైనల్ పాసయ్యాడు.

రామ : (నవ్వుతూ) అప్పుడోసారి మీతో చెప్పాను కదండీ గోపాలంగారూ! ఆ అబ్బాయి గురించే... సుబ్బారావు కొడుకు.

గోపా : ఓ! అదా... గుర్తుంది. (ప్రభాకరం వేపు తిరిగి) అంటే, ఆ అబ్బాయి వుద్యోగానికీ, నీ పెళ్ళికీ లంకె తగిలిస్తున్నావన్నమాట!

ప్రభా : (నవ్వి) లేకుంటే యేముంది అండీ! మామూలు ధోరణిలో అడిగితే అవకాశం లేదని చెప్పేరు, మీరు చెయ్యగలిగివుండీ కూడా.

గోపా : అందుకే యీవిధంగా వలపన్నావన్నమాట. ఒకవేళ యిప్పుడూ కాదంటాననుకో... (సూటిగా చూస్తాడు)

ప్రభా : మీరు కాదనరని నాకు తెలుసు. ఒక స్వల్పవిషయం కోసరం, సదవకాశాన్ని విడిచిపెట్టరు... (నవ్వుతాడు)

గోపా : గొప్ప తెలివైనవాడవోయ్... అతనికి వుద్యోగం వేయించటం ఘనకార్యం కాకపోయినా కొంత శ్రమ తీసుకోవాలి... సరే ప్రయత్నిస్తాను.

ప్రభా : ప్రయత్నిస్తానంటే కాదండోయ్... మా చెల్లాయికి మంచి సంబంధం చూస్తానన్నారట... ఆ శ్రమ మీరు పడకుండా, అందుకు బదులుగా యీ శ్రమ తీసుకోండి.

గోపా : (ఆశ్చర్యంతో) అంటే, నాకేమీ అర్థం కాలేదు... మీ చెల్లాయికి మరి సంబంధం చూడనవసరం లేదన్నమాట! ఏం సంబంధం యేదన్నా కుదిరిందా యేమిటి?

రామ : సుబ్బారావు కొడుక్కే మా అమ్మాయిని యివ్వాలని వుందండీ!

గోపా : (ఆశ్చర్యపోతూ) ఏమిటీ! ఆ అబ్బాయికి మీ అమ్మాయిని యివ్వడమా?

రామ : తప్పేముందండీ! వాళ్ళు మాకు బంధువులు కూడాను. ఇప్పుడంటే వాళ్లిలా చితికిపోయారు గాని, మొదట్లో బాగా కలిగినవాళ్ళే! డబ్బు లేనంతమాత్రాన సంబంధాలు, బంధుత్వాలూ విడిచిపెట్టుకోమని సిద్ధాంతం ఎక్కడా లేదుగా! మా అమ్మాయికి నేనే కొంత డబ్బు యిస్తాననుకోండి. అప్పుడు వాళ్లు ఆస్తిపరులేనా? ఏమంటారు?

గోపా : (చిరునవ్వుతో) చాలా సంతోషమండీ! నిజంగా మీ హృదయం చాలా విశాలమైనది. ఆ అబ్బాయికి రేపే ఆర్డరు వేయించేస్తా. ప్రభాకరం! మరి, నీ మాటేమిటోయ్.

ప్రభా : (నవ్వి) నాకేం అభ్యంతరం లేదు......తతిమ్మా విషయాలన్నీ పెద్దలు మీరు మాట్లాడుకోవల్సిందే.

గోపా : (నిట్టూర్చి) హమ్మయ్యా! (కుర్చీలో చేరబడతాడు.) ('రామదాసుగారూ' అని బయట కేక వినిపిస్తుంది.)

రామ : అబ్బాయ్... యెవరో చూడరా.

ప్రభా : సుబ్బారావుగారి గొంతులా వుంది. (వెళ్తాడు)

రామ : రమ్మను... వేగిరం పో...

గోపా : మంచి సమయానికే వచ్చారు ఆయనకూడా.

(సుబ్బారావు, ప్రభాకరం వస్తారు.)

సుబ్బా : (వస్తూ) నమస్కారమండీ రామదాసుగారూ! నమస్కారమండీ గోపాలంగారూ!

రామ, గోపా : (ఒకేసారి) నమస్కారం. కూర్చో... కూర్చో...

(సుబ్బారావు కూచుంటాడు)

గోపా : అవుతే సుబ్బారావ్, ఇప్పుడు

మనమంతా సన్నిహితుల మౌతున్నామోయ్.

సుబ్బా: (అర్థం కాక) ఏమిటీ వీరం టున్నది?

గోపా: (నవ్వుతూ) ఇంకేమిటయ్యా! అనూహ్యంగా అదృష్టదేవత మీ కాళ్ళమీద వచ్చి పడుతుంటేనూ! రామదాసుగారు వాళ్ళమ్మాయిని మీ కోడలుగా చేస్తున్నారు.

సుబ్బా: (నవ్వుతుండా) పరిహాస మెందుకండీ మాతో! మేం పేదవాళ్ళం...

రామ: లేదు సుబ్బారావ్...పరిహాసం కాదు. మా వసంతని రమణమూర్తి కివ్వాలని వుంది. నీ కిష్టమేనా?

సుబ్బా: (ఆనందం పట్టలేక) నిజం గానా?

రామ: నిజంగానే...

సుబ్బా: (వుత్సాహంగా) అంత కంటె యింకేం కావాలి? మా కష్టాలన్నీ గట్టెక్కించే లక్ష్మి అవతారమే మాయింట్లో పడుతోం దంటే యెంత అదృష్టం! (నిస్పృహ ఒక్క సారి ఆవరించి) కాని....కాని....అబ్బాయి...(చెప్పలేదు)

గోపా: (నవ్వి) ఉద్యోగం లేదంటా వు...రేపు వుదయం పది గంటలకు మా ఆఫీసుకి పంపవోయ్ అబ్బాయిని. రేపే ఆర్డరు వేయించేస్తాను.

సుబ్బా: నాకిదంతా కలగంటున్నట్టే వుందండీ! ఇక్కడ వుండలేను మరి...వస్తానండీ! మా ఆవిడకు యీ శుభవార్తలు చెబితే ఎంత ఆనందిస్తుందో, వస్తా రామదాసు గారూ (నిష్క్రమిస్తాడు)

రామ: అమాయకుడు...ఎంతగా సంబర పడిపోతున్నాడో!

గోపా: కాదుటండీ మరి: ఉద్యోగం దొరకడం మాటటుంచితే, మీ అమ్మాయి, వాళ్ళ యింటి కోడలవ్వటం వాళ్ళెప్పుడూ కలలోకూడా అనుకుని వుండరు. అంత అదృష్టం పట్టొద్దూ! మరిక నేను వెళ్ళొస్తా...రేపు మనం అన్ని వివరాలూ మాట్లాడు కుందాం. (లేస్తాడు)

రామ: మంచిదండీ!

ప్రభా: నేనూ అలా వెళ్ళి వస్తా న్నాన్నా:

(ప్రభాకరం, గోపాలం వెళ్ళిపోతారు)

రామ: అమ్మాయ్ వసంతా!

వసం: ఏం నాన్నా? (వస్తుంది)

రామ: రమణమూర్తిని పెళ్ళి చేసుకోవటం నీకిష్టమేనా అమ్మాయ్...సిగ్గుపడకు...... చెప్పు...

వసం: (నవ్వుకుంటూ లోపలికి తుర్రు మంటుంది)

రామ: (నవ్వి) పిచ్చి పిల్ల...అమ్మాయి అన్నమాట నిజమే మరి. (లేచి లోపలికి పోతుండగా)

...తెర...

# వనితా లోకం

## వేడితే నీరు; లేక వేడి తేన్ ఈరు

మనము అనుకోనట్లుగా జీవితంలో కొన్ని తమాషా పనులు నడుస్తుంటాయి. చాకలి పద్దు వ్రాసేటప్పుడు తనకు తెలియకుండానే మా బావగారు తమాషాగా పద్దు రాస్తూ వుండేవారు. బట్టలు ఖరారు పాటు కాకుండా ఉండటానికి ఆయన, 4 పాతసర్దు చొక్కాలని, 4 కొత్తసర్దు చొక్కాలని నాలుగు కడపగుర్తు లాగులని, 2 ఎఱ్ఱగీతల గుర్తు ఆఘారాలని, ఇలా ఇంట్లో అందరి బట్టలను పద్దు రాస్తూంటారు. ఇలా మామూలుగా నడుస్తూ వుండేది.

ఒకనాడు నేను చాకలిపద్దు రాస్తూ, రెండు పాతబావకోట్లు, రెండు కొత్త బావకోట్లు రెండు నల్లబావకోట్లు, ఐదు నల్లగీతల బావపంచలు అని వ్రాసి గట్టిగా చదివాను. ఆ పద్దు విని మా బావగారు, ఎంతమంది బావలే నీకు? అలా చదువుతున్నావు! అని బిగ్గరగా అన్నారు. ఆ మాట విని మేమందరూ గట్టిగా నవ్వుకున్నాము.

* * *

మేము కాపరం వుండే కాంపౌండులో ఐదారు కాపరాలుండేవి. ఇంట పనులన్ని చేసుకొన్నాక, తీజారుతో, పడసాల ముందు కూర్చుంటూ "గోవిందా" అని హరి నామస్మరణ చేసుకుంటూ కూర్చోవటం నాకొక అలవాటైపోయివుండేది. ఒకనాటు ఆ ఇండ్లలో ఒక ఇంటికి గోవిందరావనే ఆయన కాపరానికి వచ్చారు. నేను మామూలుగా "గోవిందా" అని అనుకున్నప్పుడల్లా అతను తిరిగి చూడటం కలిగేది. అది గమనించి నా మనసులో నేనే నొచ్చుకొని, గోవిందా అని అనటంమాని "నారాయణా" అని అనుకోటం అలవాటు చేసుకున్నా. "నారాయణ" అని అలవాటు అయ్యే వేళకి, ఆ కాంపౌండులోని మరో ఇంటికి నారాయణమూర్తి అనే బ్యాంకి గుమాస్తా కాపరానికి వచ్చారు. మామూలు ప్రకారం నేను "నారాయణమూర్తి" అని హరినామస్మరణ చేసుకున్నప్పుడల్లా అతనూ తిరిగి చూడటం కలిగింది. దాంతో ఆమాట వదిలేసి "ఉష్ రామచంద్రా" అని అనుకుంటూ వుండగా, ఇంకొక ఇంటికి "రామచంద్రరావనే" ఆయన కాపరాని కొచ్చారు. మరలా మొదటి కథే జరగటం సంభవిస్తుందేమోనని "రామస్వామి" అని అలవరచుకున్నాను. ఈ ముక్క అలవడేసరికి మా ప్రక్కింటికే "రామస్వామిగారని" ఒక అతను కాపరానికి వచ్చేశారు. ఈ నా ఇబ్బంది గమనించి మా బావగారు "శ్రీహరి" అని అనుకోవటం అలవాటు చేసుకోవమ్మా అలాంటి

పేర్లు అరుదుగా వుంటాయిలె అని అన్నారు నాలో నేను నా "హరినామస్మరణకు" కలిగిన అవాంతరాలకు నవ్వుకున్నాను.

* * *

మా చిన్నతనంలో మా వీధిలో వెంకమ్మ అనే ఇల్లాలు వుండేది. మేమందరమూ ఆవిడను వెంకమ్మ పిన్నిగారని పిలుస్తూ వుండేవారము. మేము ఎప్పటికి పేరంటానికి వెళ్ళినా పిన్నిగారు కూడ అప్పటుండే వారు. వెంకమ్మ పిన్నిగారూ, పాట పాడండి అని ఆ ఇంటివారు అడగటం తోటే, వెంకమ్మ పిన్నిగారు పాటపాడటానికి మొదలుపెట్టేది.

"నలుగూకు రావుగా, నందా బృందా" అని నలుగుపాట మొదలుపెట్టి కొస్త పాడడం, ఇంతలో ఆ పాటను నిలిపి, "ఆ అగరు వత్తుల గిన్నెను కొస్త ప్రక్కకు పెట్టండమ్మా" అనటం. మరలా "నలుగూకు రావుగా" అని పాటను మొదలు పెట్టటం. ఇంతలో ఆ పాటను అపి "ఏమమ్మా పద్మమ్మగారూ! కనుపించటం లేదే, బాగున్నారా! అమ్మాయిఅత్తారింటినుంచి వచ్చిందా?" అని పక్కావిడను అడగడం జరిగేది. ఆ మాట అయ్యాక మరలా పల్లవి మొదలు పెట్టేది. మరలా కాస్త పటికల్లా పాటను ఆపి, "ఏమమ్మోయ్ సీతమ్మ గారిని ఈవూరినుంచి ఎదలీ ఈ రటగా!" అని దూరానవున్న మరో ఆవిడను పలుకరించేది. ఇలా ఈపాట పల్లవినే అపటం, మొదలుపెట్టడం జరుగుతూ, ఇతరులను విచారించటంలోనే వుండేదిగాని, పాట సాంతం అయ్యేదికాదు. మేమందరం నవ్వుకొని, అలా ఎవరన్నా పాడితే, వెంకమ్మ పిన్నిగారి పాట అని అనటం మామూలు అయింది.

* * *

మా అత్తయ్యగారు మాకు తన చిన్నతనంలో జరిగిన ఒక కథ చెప్పేది. అదిఏమిటంటే, ఒకవూళ్ళో ఒక బ్రాహ్మణుడుండేవాడట. అతను చూడటానికి ఎంత లావుగా, పుష్టిగా అందంగా వుండేవాడో లోపలికి అంత పిరికివాడట. ఇంతేకాకుండా వేపకాయంత వెఱ్ఱికూడ వుండేదట. కాని అతనిభార్య మాత్రం మంచి ధైర్యం ఉన్నమనిషి. ఒకనాటి రాత్రి వారింటికి ఒకదొంగ వచ్చాడు. భార్య మేలుకొని, భర్తతో తిన్నగా "ఏమండీ, ఇంట్లోకి దొంగ వచ్చినట్లుందండి," అన్నది. ఆ మాటలు విని అతను భార్యతో తిన్నగా, "గట్టిగా కండ్లు మూసుకొని పండుకో" అని అన్నాడు. తీరా దొంగ ఆమె దగ్గరకెళ్ళి, నగలకోసం మెళో చేయి వేయబోగానే ఆవిడ ధైర్యముతో సిద్ధంగా ఉన్నందువల్ల వాడిచెయ్యి గట్టిగా పట్టుకొని "ఏమండీ, లేవండీ. దొంగను పట్టుకున్నాను" అనిగట్టిగా భర్తను పిలవసాగింది. ఇలా జరుగుతుందని తెలియక దొంగ అకస్మా

(39- వ పేజీ చూడండి)

# ★ (పక్కింటివారి) పుస్తక పఠనము ★

మాకు పుస్తకాలు చదవడమంటే మహా సరదా. కనీసం అయిదారు రకాల పుస్తకాలయినా మా యింట్లో ఎప్పుడూ వుంటూనే వుంటాయి. పుస్తకాలు మాకు ఎంత ఆనందాన్నిస్తున్నాయో అంత చిక్కుల్ని కూడా తెచ్చిపెడుతున్నాయి.

పుస్తకాలు అంటూ తెప్పిస్తున్నపుడు ప్రక్కింటివాళ్ళదగ్గరనుంచీ, స్థానిక పరిచితులవరకూ పుస్తకాలను, 'చదివి యిప్పుడే పంపిస్తా'మని తీసుకువెళ్ళడం పరిపాటి. మా యింట్లోనూ అంతే అయింది. 'తన కాయుష్యం - తన కారోగ్యం' అన్నట్లు మనము మాత్రము చదువుకొని యితరులకు యివ్వక పోవడం బాగుండదు. తీసుకువెళ్ళేటప్పుడు మన ఎదుట ఎంతో జాగ్రత్తగా తీసుకువెళ్తారు మనం చూస్తున్నామూ అని. తీరా వాళ్ళు తిరిగి యిచ్చేటప్పుడు చూడాలి పుస్తకాల తీరు. కొన్ని పుస్తకాలు అసలు తిరిగి రావు కూడాను. "అప్పుడే తెచ్చియిస్తినే" అనో, "మీరు పనిలో వుంటే ఈ డ్రాయరు మీదే పెట్టివెళ్ళా"మనో అంటారు. ఇంక ఏమనుకుంటాము చెప్పండి. పరిచితులు. చుట్టాలు. పైపెచ్చు మొహమాటం. ఇక యివ్వకూడదనుకొంటే "అబ్బో! మీరేగనుక తెప్పిస్తున్నారు. మాకేం గతిలేక మిమ్మల్ని పుస్తకాలు అడగటంలే"దని మొదలు పెడ్తారు.

మా యింట్లో ఇంగ్లీషు పుస్తకాలయితేనేం, తెలుగు పుస్తకాలయితేనేం తీసుకువెళ్ళేవాళ్ళు మొత్తం ఆరు కుటుంబాలవారున్నారు. ఈ ఆరు కుటుంబాలలో కూడా ఒక్కరుగా ఒక కుటుంబానికి ఒక ప్రతినిధి చొప్పున వుండి తీసుకువెళ్ళరు. ఆకుటుంబంలో ఎంతమంది వున్నారో దాదాపు అంతమందీ ఏదో పుస్తకం తీసుకువెళ్తుంటారు. ఎవరు ఏ పుస్తకం తీసుకువెళ్ళింది, ఎవరు ఏ పుస్తకం తీసుకువచ్చింది గుర్తే వుండదు. ఇక లైబ్రరీలోలాగా 'ఇష్యూ బుక్కు' తయారు చేయాలి, నెలకి నలభై పేజీల పుస్తకం పెట్టి. ఆ పుస్తకం కూడా చూపిస్తామని తీసుకువెళ్తారేమో అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు. 'ఆంధ్రపత్రిక' మాకు ప్రతివారం ఓకుర్రాడు యిచ్చిపోతూంటాడు. "ఆంధ్రపత్రిక, ఆంధ్రపత్రిక" అని అతను శనివారమే అరుస్తూ వస్తాడు. అతను మా యింటికొచ్చేలోపలే ఆ కేక, కనీసం, మూడు కుటుంబాలకన్నా వినపడుతుంది. ఈమూడు కుటుంబాలవాళ్ళూ వచ్చి ఎవరో ఒకరు లాక్కెళ్తారు. ఆ పుస్తకం మా యింటికి రావడం, మేము చదివి యింకొకరికి యివ్వడమూ సాధారణంగా జరుగదు. ఆ, ఆరు కుటుంబాలలోనే తిరుగుతూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు వాళ్ళ పరిచితుల వద్దకు కూడా వెళ్తుంటుంది. తీసుకవెళ్ళిన వారిని అడిగితే భలానావాళ్ళకి యిచ్చామనీ, ఆ భలానావాళ్ళని అడిగితే యింకొకరికిచ్చామనీ, వాళ్లనడిగితే "అప్పుడే యిచ్చామమ్మా మేము ఎప్పుడూ మీ పుస్తకాల విషయంలో జాగ్రత్తగానే వుంటాము, ఇటువంటివి వస్తాయనే" అని అంటారు. ఆ పుస్తకం పోయినట్లే.



ఆర్. ఎస్. లక్ష్మి

ఒకసారి మాయింటి పక్కావిడ తెలుగు పుస్తకాలిమ్మని వచ్చింది. "ఏమీ లేవనీ, అన్నీ తాను చదివినవే" ననీ చెప్పాను తెగించి. నేను చదువుతున్న ఒక సినిమా పత్రికమీద పడ్డది ఆమెదృష్టి. ఇప్పుడే చూసియిస్తాను. అని తీసుకొంది. ఆమెకి "ఎబిసిడి"లు కూడా రావు. బొమ్మలు చూడడానికని తీసుకొంది. బొమ్మలు చూడటమే కదా! అక్కడే చూడకూడదూ.

"పొయ్యిమీద పప్పుపెట్టి వచ్చాను మాడిపోతుందేమో! యింటికెళ్ళి చూచి అబ్బాయిచేత పంపిస్తాలే" అని తీసుక వెళ్ళింది ఆ సాయంత్రం మావారు కాలేజీ నుండివచ్చి కాఫీత్రాగి ఆ పత్రిక ఇవ్వమని అడిగారు. భలానావాళ్లు తీసుకు వెళ్లారని చెప్పేను. [illegible] "వాళ్ళకి ఇంగ్లీషుముక్క కూడా రాదు., వాళ్ళకెందుకు యిచ్చావు తెలుగు పుస్తకాలు చాలక" అని అన్నారు. "పోనీలెండి యిప్పుడు తెస్తాగా" అని వాళ్ళింటికి వెళ్ళాను. మాయింటికి ప్రక్కనే లెండి వాళ్ళయిల్లు. మాచుట్టాలు కూడాను. తీరా వాకిట్లోకి వెళ్ళేసరికి నాకు ముందుగా, ముందుపేజీ బొమ్మ కనిపించింది. సరే కనీసం లోపలిపుస్తకమన్నా దొరుకుతుందనే ఆశతో లోపలికి వెళ్లాను. ఇంకేముంది. ఆయింటి తలుపుమీద పుస్తకంలోని బొమ్మలన్నీ కత్తిరించి నీళ్ళతో అతికించబడి వున్నవి. సగం అతికిన రంగురంగుల సర్గీసు బొమ్మ నన్ను చూచి నవ్వింది. అసలు సంగతి ఏమిటని కనుక్కొంటే వాళ్ళ పుత్రరత్నం చేసినపని అని తేలింది. మా వారికి ఏమని సమాధానం చెప్పేది చెప్పండి.

ఒక రోజు వారపత్రిక వచ్చింది. వెంటనే తీసుకు వెళ్లారు మామెంబర్సు. ఆసాయంత్రం మా మరిదిని పంపేను 'తీసుకురా బాబు' అని. పాపం వాడు తీరావెళ్ళి అడిగితే "యిస్తాం లేరా, చదవద్దూ? ఎవరైనా చదివేదేగా" అని కసిరి పంపేరు. పాపం ఏడేళ్ళ పుంక వాడేమి, మాట్లాడుతాడు. ఇంకొకసారి పొమ్మంటే నేను పోనం"టాడు.

"కసిరారట గదా" అని మా అత్తగారు అడిగితే

"అబ్బే సరదాగా అన్నాము కసిరామని చెప్పేడా? వీరా! నాన్నా!! నిన్ను కసిరానూ?" అని ముద్దుపెట్టుకుంటారు!

ఒకవేళ మా వారు వెళ్ళి పుస్తకం అడిగితే "ఆయనగారి శ్రీమతి చదువుకోవాలి కాబోలు యివ్వవే" అంటారు చనువుగా, సూటీ పోటీగా "ఎవ్వరైనా చదువుకొనేదేగా!" అంటారేగాని అది వాళ్ళని వాళ్ళు అడిగి చూచుకోరు

వీళ్ళబాధ వ్రాయాలంటే యింతింత కాదు ఇదంతా వ్రాయడం ఆ బాధపడే వారికోసము కాదు. ఆ బాధలు కలుగచేసే వారికోసము. మనవికాకపోతే సరి అని ఏవస్తువా యిష్టమొచ్చినట్లు వాడకూడదని, గమనించాలి తామే పుస్తకాలు తెప్పిస్తూ యితరులు ఆ పుస్తకాలను చింపినా, పాడేసినా వారికి ఎట్లా వుంటుందో ఒకసారి వూహించుకొంటే బాగుంటుంది. పుస్తకాలు కావాలని తెప్పించుకుంటున్న వాళ్లున్నారు. అవి రాగానే, కనీసం మేము బొమ్మలైనా చూచే భాగ్యము ఉండదు. ఈ అవస్థ వాళ్ళూ పడుతున్నట్లు వూహించుకొని, యితరుల పుస్తకాల విషయంలో యికనైనా జాగ్రత్త చూపిస్తారని తలుస్తున్నాను. ★



# నలుగురూ కలిసి పనిచేసిన నాడు

ఆరోగ్యమే మహాభాగ్యం అన్నారు మామూలు భాగ్యం ఎంత ఉన్నా ఈ మహాభాగ్యం లేకపోతే జీవితం దుర్భరం అయిపోతుంది వ్యాధుల నివారణకు, చికిత్సకు ప్రభుత్వం చేసే కృషి అలా ఉంచి, ప్రజలే సాధ్యమైనన్ని కట్టుదిట్టాలు చేసుకోవడం చాలా అవసరం చేయవలసిన అవసరంఉంది కాబట్టే ఉంది అన్న సంగతి గ్రహించి అందుకోసం నలుగురూకలసి పట్టుదలతో పనిచేస్తే పెద్దపెద్ద పనులు చాలా తేలిగ్గా సాధించవచ్చును అమెరికాలోని అనేక పట్టణాలలో స్త్రీలు ఇలాంటి పెద్ద పనులు నిర్వహిస్తున్నారు అలా స్త్రీల కృషివల్ల వెలసిన చికిత్సాకేంద్రాలలో హూస్టన్ (టెక్సాస్ రాష్ట్రం)లోని బ్లూబర్డ్ క్లినిక్ ఒకటి ఇక్కడ మూర్ఛరోగంతో అవస్థపడే పిల్లలకు వైద్యం చేస్తారు ఇక్కడ నర్సులుగా సహాయకులుగా పనిచేసే వారిలో జీతభత్యాలు తీసుకునేవారు బహుకొద్దిమంది అంటే దీన్ని నెలకొల్పినవారిలో ధనికులైన మహిళలు చాలమంది ఉన్నారు వాళ్ళంతా ఉచితంగా పనిచేస్తారు డబ్బు అవసరం ఉన్న కొద్దిమందికి జీతాలిస్తారు ఇలా వీళ్ళు నడుపుతున్న ఈ చికిత్సాకేంద్రంలో మంచి అనుభవం గడించి పేరు తెచ్చుకున్న వైద్యురాలు డా॥ డోరా చావో పనిచేస్తోంది ఇపుడీ ఆస్పత్రికి అమెరికా అంతటా మంచిపేరు వచ్చింది మూర్ఛరోగంతో బాధపడుతున్న పిల్లలను (సాలుకు 250 మందివరకూ) వివిధ రాష్ట్రాలనుండి ఇక్కడికి తీసుకవస్తున్నారు ఇదంతా ఒక నగరంలోని కొద్దిమంది తల్లుల చలవ

ఈ ఆస్పత్రికి కావలసిన డబ్బు సంపాదించడానికై ఇక్కడ వీరు చలనచిత్ర ప్రదర్శనాలు, నృత్య ప్రదర్శనాలు నిర్వహిస్తారు 'బ్లూబర్డ్' మండలి సభ్యులైన నాలుగు వందలమంది మహిళలూ, బొమ్మలూ, దుస్తులూ, లేసులూ మొదలైనవి తయారుచేసి అమ్మించి, ఆ డబ్బును ఈ నిధికి ఇస్తారు 'బ్లూ బర్డ్' పేరిట వంటకాలగురించిన పుస్తకాలు అచ్చువేసి అమ్మించి డబ్బుచేస్తారు

పిల్లలకు కథలూ కబుర్లూ చెబుతున్న డా॥ చావోను, ఈ ఆస్పత్రిలో ఉచితంగా సేవచేస్తున్న ఒక పడుచును ఈ చిత్రంలో చూడవచ్చు

**వంటలు:**

# వేరుశనగతో

## బూరెలు

వేరుశనగ పప్పు వేయించుకొని తినడమే కాకుండ, వీటితో పిండివంటలు కూడ చేసుకోవచ్చును. ఈ క్రింద చెప్పినవాటితో బూరెలు చేసుకొనవచ్చును.

కావలసిన వస్తువులు: ఒక సేరు వేరుశనగ పప్పులు (పొట్టు ఒల్చినది), అర్ధవీశె బెల్లము, పోలెడు బియ్యపుపిండి (కొట్టినది), పోలెడు మైదాపిండి, పోలెడు శెనగపిండి.

తయారుచేయు విధానము: వేరుశెనగ పప్పు ముందుగా పెట్టుకొని పొయ్యిమీద బూరెల మూకుడు కాలేసి, బాగా కాలిన తర్వాత అందులో వేసి దోరగా వేయించవలెను. ఒక వెడల్పాటి గిన్నెలో బియ్యపు పిండి, మైదాపిండి, శెనగపిండి నీళ్ళతోడి మరీ పల్చగా కాకుండ, మరీ గట్టిగా కాకుండ సమపాళ్లలో కలుపవలెను. వేయించిన పప్పులను పొట్టు తీసివేయవలెను. బెల్లమును పప్పులను తీసికొని రోటిలోపోసి ముద్ద అగువరకు దంచవలెను. నీళ్లు పోయకూడదు. పొయ్యిమీద బాణలి (బూర్లె మూకుడు) పెట్టి నూనె పోయ్యవలెను. నూనె బాగా కాగిన తర్వాత పప్పులను, బెల్లమును కలిపి ముద్దచేసినది పెద్ద ఉసిరికాయలంత ఉండలుచేసి, ముందుగా, నాన పెట్టిన పిండిలో ముంచి నూనెలో వేయవలెను. దోరగా వేగిన తర్వాత తీయుచుండవలెను. ఇట్లా చేస్తే ఇవి శెనగపప్పు బూరెల కన్నా రుచిగా వుంటాయి. వేరుశెనగ పప్పు వేయించిపురిపోరలో కూడ కలుపుకుంటారు.

* * *

### వేరుశనగపప్పు పచ్చడి

వేరుశనగ పప్పులో పచ్చడి కూడా చేసుకోవచ్చును.

ముందుగా వేరుశనగ పప్పులను దోరగా వేయించాలి. ఆవాలు, మెంతులు, మిరపకాయలు కావలసినవి తీసికొని పోపు వేయించి వుంచుకొనవలెను. పప్పులకు సరిపడ చింతపండు, ఉప్పు చిటికెడు పసుపు తీసికొనవలెను. తర్వాత వేరుశనగ పప్పులు, వేయించిన పోపు, చింతపండు, ఉప్పు పసుపుకలిపి మెత్తగారుబ్బవలెను. ఈ పచ్చడి శెనగపచ్చడి మాదిరిగా బాగా రుచిగా వుంటుంది. ముందు కొద్దిగా చేసుకొ చూచుకుంటే దాని రుచి తెలుస్తుంది. పాళ్ళు సరిగ్గా చేసుకొనవలెను.

గుడిపాటి సత్యవెంకట సుబ్బలక్ష్మి,
కోరుకొల్లు.

* * *

### హల్వా

దీనికి కావలసిన సామానులు: పావుసేరు వేరుశెనగపప్పుకి పావుసేరు పంచదార, పావుసేరు పాలు, పావుసేరులో సగం నెయ్యి.

చేసేవిధానం: ముందు వేరుశెనగపప్పు వేయించాలి (మాడిపోకుండా వేగాలి) బాగా తొక్కవచ్చేలా వేయించాక దానిని తొక్కతీసి శుభ్రపరచి ఒకపావుసేరు పప్పు (తొక్కతీసినది) కొలుచుకు అది రోటిలో వేసి మెత్తగా దంచాలి. దంచిన తరువాత రుబ్బటం సులభం. ఆ దంచినదానిని కొలిచి వుంచుకున్న పావుసేరు పాలలో కొంచకొంచం పోస్తూ మెత్తగా కాటికలా రుబ్బాలి. ఆ రుబ్బినదానిని ఒకగిన్నెలోకి తీసుకుని అందులో పావుసేరు పంచదారా, రుబ్బినప్పుడు పెయ్యగామిగిలినపాలూ వేసి గరిటెతో కలిపి ఒకప్రక్క వుంచుకుని కుంపటిమీద గిన్నె పెట్టి అందులో అర్ధపావు సేరులోనిది కొంచెం నెయ్యితీసి ఆగిన్నెలో వేసి బాగా మరిగినతరువాత రుబ్బి వుంచుకున్న ముద్ద అందులో వేసి అడుగంటకుండా దించేదాకా కలుపుతూవుండాలి కొంతసేపటికి నెతితో ఈ ముద్ద వుడుకుతుంది. అప్పుడు మరికొంచెం నెయ్యి వేస్తీ కలపాలి. ఇట్లా కొంతసేపు వుడికిన తరువాత కావాలంటే నెయ్యి వేయవచ్చు లేకపోతే లేదు. తరువాత చేతికి నెయ్యి రాసుకుని హల్వా పట్టుకుచూస్తే వుండలా అవుతుంది. అప్పుడు క్రిందికిదించి పళ్ళానికి నెయ్యిరాసి దానిలో ఇది పోసేయాలి. దీనిని చెమ్చాతోతీసుకు తింటానికి బావుంటుంది. దీనికి నెయ్యికొలత లేదు. నేను వుజ్జాయింపుని చెప్పాను. ఇది చాలా బావుంటుంది. ఇదే విధంగా జీడిపప్పులో కూడా చెయ్యవచ్చు. రెండురకాలూ బావుంటాయి.

### దోసెలు

ఇంక రెండోరకం ఏమిటంటే వేరుశనగ పప్పుతో దోసెలు.

వీటికి కావలసినవి: పావుసేరు బియ్యం, పావుసేరు వేరుశెనగపప్పు, తగినన్ని ఎండు మిరపకాయలూ, తగినంతఉప్పు కొద్దిగా జీలకఱ్ఱ.

చేసేవిధానం: ముందు వేరుశెనగపప్పూ బియ్యం వేరేవేరేనీళ్ళలో నానబెట్టాలి. ఇట్లా మూడుగంటలు నానిన తరువాత బియ్యం బాగా కడిగివేయాలి. తరువాత వేరుశెనగపప్పు (దీనిని వేయక్కరలేదు, పచ్చిదే) తొక్కపూర్తిగా వచ్చేసేలాకడిగి అదీ ఇదీ కలిపి మెత్తగారుబ్బి అందులో మిరపకాయలూ, ఉప్పూ, జీలకఱ్ఱావేసి మెత్తగా రుబ్బి అదిఒకగిన్నెలోకితీసుకు. గరిటె జారుగా వుండేటట్టు నీళ్ళువేసికలిపి, కుంపటిమీద అట్లపెనం కాలేసి, దానిమీద నూనెవేసి ఈ రుబ్బినపిండిని గరిటతో పల్చగాపోసి ఎఱ్ఱగా కాలనిచ్చి వాటిని వేడిమీద తింటే చాలాబావుంటాయి. ఇవి దోసెలు.

ఇంక మూడోరకం: వేరుశెనగపప్పుతో వుండలు. దీనికి మళ్ళీ వేరుశెనగపప్పు వేచి తొక్కతీసి కొలుచుకువుంచుకోవాలి. వీటికి కొలతలు పావువీశె బెల్లానికి అర్ధసేరుపప్పు. అంతే వీటికి మరేం అవసరంలేదు. ముందు బెల్లంలో కొద్దిగానీళ్ళు వేసిపాకంరానివ్వాలి. (గిన్నె కుంపటిమీదపెట్టాలి) ఆపాకంబాగా ముదరనివ్వాలి. ఆపాకం ఎలా తెలుస్తుందంటే కొంచెంనీళ్ళు ఒకప్లేటులోవేసి అందులో కొంచంపాకం వేసిచూస్తే అప్పుడు చేతికి వుండలా తగులుతుంది (అంటే వుండపాకం అన్నమాట) ఆపాకంలో ఈపప్పువేసి పాకం పప్పూ బాగాకలిసేటట్టు కలిపి చేతికి నూనె రాసుకు వుండలుచెయ్యాలి. ఈవుండలు వేడిమీద నేచెయ్యాలి. ఇవికూడా, చాలాబావుంటాయి. దీనికి బెల్లంమాత్రం బాగా జిగురుగా వున్నదయితే బావుంటుంది.

బలభద్రుని వరలక్ష్మి (విజయనగరం)

### అనపకాయతో హల్వా

ఈ వానా కాలములో అనపకాయలు (లేక సొరకాయలు) చాలా ఎక్కువగా కాస్తాయి. అందరూ కూరలూ పులుసులూ వండుకుంటారు. హల్వా చేయుట చాలా మందికి తెలియక పోవచ్చును. హల్వా చేయు విధము వ్రాయుచున్నాను. ముందు కొంచెముగా చేసి చూసుకోండి—

ఒక లేత అనపకాయ దళసరిగా చెక్కుతీసి మధ్యకు రెండు ముక్కలుగా కోసి ఎండు కొబ్బరి తురిమేపీట మీద కొబ్బరి తురిమినట్లు తురిమి ఒక పళ్ళెములోకి తీసుకోవాలి. కుంపటిమీద ఒక మందపాటి గిన్నె కొలపెట్టి రెండుస్పూన్లు నెయ్యివేసి కొంచెము నీళ్లు పోసి, అనపకోరు ఎంతవున్నదో అందులో సగం పంచదార ఉజ్జాయింపున మాసికొని

# స్త్రీలకు ప్రత్యేకం గ్రంథాలయాలు

ముసురుపట్టి వగలంతా వర్షము కురుస్తోంది. పాపాయి పడుకుంది. పనులన్నీ అయిపోయాయి. ప్రొద్దుపోవటంలేదు. చదువుకోటానికి వాతావరణం అనుకూలంగా వుంది. గంటసేపటినుండి జవానుకోసం చూస్తున్నాను. అతనికి రెండు పుస్తకాలిచ్చి, అవి లైబ్రరీలో ఇచ్చి వేరే పుస్తకాలు తెమ్మని పంపాను. ఎలాగైతేనేం చివరకు పుస్తకాలు తీసుకొచ్చాడు. తీరాచూస్తే అవి రెండూ ఇంతకుముందు నేను తెప్పించుకొని చదివిన పుస్తకాలే, చాలా చిరాకు వేసింది. కానిఏం చేయను? తిరిగి పంపుదామంటె ఆ లైబ్రరీ మూడుమైళ్ళ దూరమాయె. పైగా వాన.

చదివిన పుస్తకాలే ఇస్తారని ఓమారు పుస్తకాలలిస్టు తెప్పించుకొని అన్నిపేర్లు వ్రాసుకొన్నాను. వాటిలో ఓపది పుస్తకాల పేర్లువ్రాసి వాటిలో రెండు పుస్తకాలు కావలసిందని ఓమారు జవాన్ను పంపాను. కాని నేనువ్రాసిన పుస్తకము ఒక్కటీ లేలేదు. లైబ్రేరియన్ తన చేతికందినది ఇచ్చిపంపాడు. నిజమే! అతనికి మాత్రం తీరిక, ఓపిక వుండొద్దూ వెదికి యివ్వడానికి? నాలాంటివా రెందరో ఆయనకు. నేనెప్పుడు రెండుపుస్తకాలు తెప్పించినా అందులో ఒకటి నేనుచదివినది తప్పనిసరిగా వుంటుంది. ఒకొక్కమారు ఒకొక్క పుస్తకాన్ని ఐదారు మార్లయినా పంపి వుంటాను.

ఇంట్లో మగవారిని పంపుదామంటె మనకు కావలసిన పుస్తకాలు వారికిమాత్రం ఎలా తెలుస్తాయి? అయినా ఒకటి రెండుసార్లు తేస్తారుగాని, రోజూ తీసుకొనిరారు. పోనీ, మనమే వెళ్దాం అనుకొంటె లైబ్రరీనిండా మగవారే వుంటారు. నేను వుండబట్టలేక అప్పుడప్పుడు బజారుకుగాని, సినిమాకుగాని వెళ్ళినప్పుడు మా వారితో పాటు గ్రంథాలయానికివెళ్లి కావలసిన పుస్తకాన్ని తెచ్చుకొంటుంటాను. గ్రంథాలయాల సదుపాయాలు లేక నిరుత్సాహపడేవారు ఎంతమంది వున్నారో!

## మంగళా కందూర్

ఇక 'రీడింగ్ రూం' (పఠనాలయము) విషయంచూస్తే, అక్కడకూడా యింతే! అంతా మగవారే వుంటారు. ఒకవేళ విధిలేక స్త్రీలువెళ్ళినా అందరికళ్ళు ఆ స్త్రీలపైనే వుంటాయి. అలాంటప్పుడు అక్కడ ఎవరికి చదవ బుద్ధిపుడుతుంది.

అందుకే నేచెప్పేదేమిటంటే ప్రతిస్థలంలోనూ (మగవాళ్ల గ్రంథాలయం వున్నచోట) స్త్రీలకుకూడ ప్రత్యేకంగా గ్రంథ, పఠనాలయాలు వుండాలి. అందులో పనిచేసేవారుకూడ స్త్రీలేవుంటే చాలా బాగుంటుంది.

స్త్రీలకు క్లబ్‌లు వున్నాయి. వాటిలో అన్నీ వుంటాయి, చాలావా అని అడగొచ్చు. కాని క్లబ్‌లు అందరికీ అందుబాటుగ వున్నాయా అనేది ఆలోచించాలి. అవి పెద్ద ఉద్యోగస్థుల భార్యలకు అనుకూలంగా వుంటాయి కాని సామాన్యులకు వీలుపడదు. అందుకే స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయ, పఠనాలయాలుంటే అందరికీ అనుకూలంగా వుంటుంది. సామాన్యులుకూడ తమకు వీలయినప్పుడు కావలసిన పుస్తకాలు తెచ్చుకొని చదవవచ్చును లేదా అక్కడే చదువుకోవచ్చు. బీదవారికి కూడా యివి అనుకూలంగా వుంటాయి. నెలకు ఒకరూపాయి కడితే ఎన్నో పుస్తకాలు చదువగలుగుతారు.

ప్రొద్దుటినుండి యింట్లో పనిచేసి, సాయంత్రం విశ్రాంతి కోరేవారు, పఠనాలయానికి వెళ్లి కాసేపు పుస్తకాలతో కాలక్షేపం చేయవచ్చు. నలుగురితోకూడ కలుస్తారు కాబట్టి కాస్సేపు యింట్లోకష్టాలన్నీ మరచి కులాసాగా కాలాన్ని వెళ్ళబుచ్చవచ్చు.

కాబట్టి స్త్రీలకు ప్రత్యేకగ్రంథాలయములు, పఠనాలయములు ఎంతయినా అవసరం. ఇంతటి సదుపాయాలు (భవనం అదీ) కుదరకపోతే, ఒక బండీమీద పుస్తకాలు అమర్చి ఇంటింటికీ పంపించే ఏర్పాటయినా చేయడం మంచిది. ★

---

పాకము పట్టవలెను. కొంచెము ముదురుపాకం వచ్చిన తరువాత ఆనపకోరు పాకములో వేసి సన్నటి సెగని ఇగురనీయవలెను కొంతసేపు ఉడికిన తరువాత కొంచెము ముద్దగా అగును. అప్పుడు ఒక పావుకోరుకు ఒక అరకప్పు నీళ్లు కలపని చిక్కనిపాలు, ఒక అరకప్పు కమ్మటి నెయ్యి పోసి, వేయించి వుంచిన జీడిపలుకులు వేసి కలుపవలెను. ఇష్టమైనవారు కొద్ది ఏలకుపొడికూడా వేసుకోవచ్చును. అడుగంటకుండా కలియబెట్టాలి. నాలుగైదు నిముషాలకు కొబ్బరి లవ్కోరా మాదిరిగా ముద్దలా అగును. అప్పుడు దించుకోవలెను. ఇది చాలారుచిగా యుండును. పిల్లలకు కూడా ఏమీ జబ్బుచేయదు. చల్లారిన తరువాత ఒక తడిలేని సీలుసబ్బాలో పెట్టి మూతవుంచితే వారముగోజులు నిలవ వుంటుంది. ఇది బెల్లముతోకూడా చేసుకోవచ్చును. ఇదేవిధముగా బొప్పాయికాయతోనూ, బూడిద గుమ్మడికాయతోనూ కూడా హల్వా తయారుచేసుకోవచ్చును.

వారణాసి సుబ్బలక్ష్మి (అదిలాబాదు) ★

---

(గతవారం హల్వాలు శీర్షిక క్రింద బ్రెడ్‌తో వంటకాలుగురించి వ్రాసినవారు ఎం. రాధాశ్రీధర్ హైదరాబాద్.)

---

# వేడి తేనీరు

(35 వ పేజీ తరువాయి)

తుగా చేతులను వదలించుకోలేక అవస్థపడుతున్నాడు. భర్త భయంతో వణుకుతూ ఉండిపోయ్యాడు. అంతేకాకుండా సాయంచేయలేని తాను అంతటితో వూరుకోక "అయ్యో ఏమేమ్! ఆ పాపిష్టిముండాకొడుకు చేతిని అలా పట్టుకుంటే కోరకన్నా కొరికేసే బాబూ" అని గట్టిగా అరిచాడు. ఇంతవరకు ఆమె చేతులలోనుంచి తప్పించుకొనుటకు తోచని దొంగ, ఆ మాటలు వింటూనే తటాలున ఆమెచేతులను గట్టిగా కరచి, పట్టువదలించుకొని పారిపోయ్యాడు. పాపం ఆవిడ భర్త మూర్ఖత్వానికి చింతించి ఊరుకుంది.

చతురోక్తులలో మంచి ప్రజ్ఞ ఉన్న మా బంధువు ఒకరుతరుచు మాఇంటికి వస్తూవుండేవారు. ఒకనాడు మధ్యాహ్నం వారు మా ఇంటికి వచ్చినప్పుడు, నేను అందరికీ టీ ఇస్తూ "వేడి తేనీరు" అని అన్నాను.

చతురుడు, సమర్థుడు అయిన ఆయన, "వేడితే, నీరు" అని అన్నాడు. నేను నవ్వి బలే అన్నాను.

ఇంతలో మావారు "వేడి, తే; నీరు" అన్నారు.

ఇంతలో మా చెల్లెలు కిలకిలా నవ్వుతూ "వేడి తేవ్, ఈరు" అని అంది. ★



# కుట్లూ, తిట్లూ, ఇక్కట్లూ



"నేను కుట్టడం మానేస్తే మా ఆయన తిడతా రండి. అందుచేతే ఆయన ఆఫీసు కెళ్ళిన తరువాత కడుతూంటాను." అని మాటమాటకీ చెప్తూంటుంది ఒకావిడ. నా కప్పట్నించి అదే ఆలోచన అయిపోయింది. ఆడవాళ్ళు ఏ పనిచేసినా దానికి ప్రతికూలంగా తప్పితే అనుకూలంగా మాట్లాడడం మగవాళ్ళకి చేత కాదా? భార్య సోమరి కాకుండా మంచి పనులు నేర్చుకుని ఇంటి అలంకరణకోసం పాటుపడుతూంటే భర్త కిష్టంలేదా? చూడ లేదా? ఈర్ష్యా?......ఇలాంటివి ప్రశ్న పరంపరలు తిరిగేవి.

వింటూంటే నిజమే అనిపించింది. అన్నలో, తండ్రులో, భర్తలో కోప్పడుతూన్నవాళ్ళున్నారు. నిజంగానే కొంత మంది మగవాళ్ళ కిష్టం వుండదు. కారణం? భార్యలే! ఒక్కొక్కప్పుడు మన సమస్యలు మనమే తెచ్చుకుంటాం. మన కష్టాలకు మనమే కారణమవుతూంటాం. అలాగ కుట్లంటే మగవాళ్ళ కిష్టంలేకపోవడానికి భార్యలే కారణం!

కొంతమందికి కుట్లంటే మహా పిచ్చి. చూసిందంతా కుట్టిపడేస్తారు. ఎవరికైనా ఓ కుట్టు వచ్చిందంటే ఆవిడతో పరిచయం చేసుకుని ఆ కుట్టు నేర్చుకుంటే కాని నిద్ర పోరు. ఒకవేళ నిద్రపోయినా కలలోకూడా ఆ కుట్టే కనిపిస్తూ ఉంటుంది. అయితే నేర్చుకోకూడదని, కుట్టకూడదని అనడం

పి. సరళాదేవి

లేదు. ఆ కుట్టు కుట్టడమే కాదు దానికి కావలసిన వస్తువులు, డబ్బు ఎవరు కష్టపడితే వస్తుందో ఆలోచించమంటున్నాను.

సినిమా పిచ్చి ఎటువంటిదో, మగవాళ్ళకి కాఫీ సిగరెట్ల పిచ్చి ఎటువంటిదో, అటువంటిదే ఆడవాళ్ళకి కుట్లపిచ్చి. డబ్బు ఎలా వస్తుంది. ఆ కుట్టేది మన కవసరమవుతుందా కాదా అనేది ఆలోచించరు. కుట్టేయాలి ఇంట్లో పడేయాలి. ఎలాగో ఒకలా అప్పు చేసో, ఇంట్లో కర్చు మానేసో కుట్టేస్తారు.




నేను ఒకరింటికి వెళ్ళాను. ఇంటావిడ చాలాగ వచ్చినవాళ్ళందరికీ చూపించడానికని రకరకాల కుట్లన్నీ కుట్టి రెండు పెట్టెల నిండా పెట్టింది. వస్తున్న కొత్తరకమల్లా కుడుతోంది. ఒక్కటి కూడా వుపయోగించడం లేదు. అరడజను హేండ్ బాగ్‌లు, అల్లిక తువ్వాళ్ళు, దుప్పట్లు, కర్చీఫ్‌లు అన్నీ వెరైటీస్ కుట్టింది. చాల బావున్నాయి—ఎగ్జిబిషన్‌లో పెట్టవలసిందే! అయితే వాటి వుపయోగమల్లా నాలాంటివాళ్ళు చూసి మళ్ళా పెట్లో పెట్టేయవలసిందే. వాళ్ళింట్లో దెబ్బలాడైనా కుట్టేస్తుంది ఆవిడ.

అన్ని 'హేండ్ బాగ్'లు ఏం చేస్తుంది? సరదాకైనా పట్టుకోడానికి వీల్లేని పల్లెటూరు. కాని ఎవరైనా వెక్కిరించినా 'ఖాతరు' చేయకుండా, ఆ సంచిపట్టుకునే గుండె ధైర్యమూ లేదు. అలాంటి మనిషి అన్నన్ని సంచీలుకుట్టేసి పెట్లో పెడుతోందిమరి.

బజారు సామానులు తెచ్చే బాగ్‌లు—అంతంత డబ్బుపోసి కుట్టిన బాగ్‌లు. ఓ పల్లెటూళ్ళో రోజూ వాడేసి పాడుచెయ్యడానికి మన సొప్పదు. అవి పెట్లో వుండవలసిందే.

అల్లిక తువ్వాళ్ళు, దుప్పట్లూ, రుమాళ్ళు, ఇవి ఎందుకూ వుపయోగపడవు. తుడుచుకోడానికి వుపయోగపడవు. బాగుండవు కూడా. అల్లికలెప్పుడూ లంగా లేసులూ కర్టెనుకే బావుంటాయి.

కర్టెనూ అవి కూడా సాధారణంగా కట్టరు. ఓ పేరంటం జరిగేటప్పుడూ పండగప్పుడూ తప్పితే. అలాంటివి అన్నన్ని కుట్టి పడేస్తే ఇంట్లో వాళ్ళు దెబ్బలాడరంటే దెబ్బలాడరూ...?

అవసరమైనవైనా ఓ రెండు మూడు కేవులు కుడుతూండడానికి ఓ జత, పండగలప్పుడు కట్టడానికి ఓ జత వుండాలి. అంతే కాని డజన్లకి డజన్లు కుట్టిపడేస్తే డబ్బు తెచ్చి పెట్టే మగవాళ్ళు విసుక్కోరూ!

మన ఆశల్ని కోరికల్ని హద్దులో వుంచుకోవాలి. మనకిష్టమయిన కుట్టువస్తే ఇది చిరగబోయే సమయానికి అది కుట్టుకోవచ్చు. అంతవరకూ మనకోరిక మనసులోనే వుంచుకోవాలి. ఏపని కూడా దొంగతనంగా చేయకూడదు. కుట్టుకోడానికి కూడా భయపడిన బ్రతుకు చేసుకోకూడదు. ఇలా మన ఆశల్ని హద్దుల్లో వుంచి అప్పుడప్పుడు అవసరమయినప్పుడు కుడుతూవుంటే భర్తలు



కింత అందమూ వుండదు. చేస్తున్నది పాడు పనిపించుకోకుండా, పేర్పరితన మనిపించు తుంటుంది.

ఎ. కనకం, (కాకినాడ)

# వనితా వాణి

## నా భావం

పోయినవారం (4-9-57) సంచికలో, వనితాలోకం శీర్షికలో పలహాలు అనువార్త లో వి. కృష్ణకుమారిగారు చక్కగా వ్రాశారు. వారి ఉద్దేశాలతో పూర్తిగా నేను ఏకీభవిస్తాను. అలాంటి చెత్తకబుర్లు చెపుతూ పలహాలిచ్చే అమ్మలక్కలు పల్లెటూరిలో నే జాస్తిగా వుంటారు. అలాంటి అమ్మలక్కలకు చేతినిండా పనులుండవు. ఆ యింటిలో మాటలు యీ యింటిలో చెపుతూ లేని పోని అభాండాలు వేస్తు తిరుగుతుంటారు. అలాంటి అమ్మలక్కల చెంతకు పోకుండా మన యిండ్లకు రానివ్వకుండా వుంటే చాలా మంచిది. కృష్ణకుమారిగారు వ్రాసినట్టుగా మంచివాళ్ళు ఎప్పుడు తోడ్పడ్తారు. అవసర సమయాల్లో ఆదుకుంటారు. మాట సహాయము చేస్తారు. అలాంటివారు నూటికి ఒక్కరు ఎక్కడో. పనిపాట లేనివాళ్ళు పుస్తకపఠనము చేయాలని వ్రాశారు. అలాంటి వారికి పుస్తకపఠనం చస్తే బుర్రకెక్కుతుందా? ఎక్కదు అని నా భావం.

కాశిరెడ్డి విజయ సుశీలకుమారి

(తుమ్మపూడి)

* * *

## వృథాగదా!

కొందరు వున్నంతలోనే ఎంతో శుచిగా ఠీవితో ఆనందంగా కన్పిస్తారు. కొందరు ఎంత డబ్బున్నా ఎప్పుడూ మాసిపోయిన బట్టలలా చిరిగిపోయిన జుట్టువాళ్ళు తీసుకో మని ఉంటారు.

కుర్చీలు మార్చి కంచం కంచం మార్చి కుర్చీలు అన్నట్టు చీర చిరిగితే కర్టెను కర్టెను చిరిగితే టేబుల్ క్లాత్ అది చిరిగితే జేబురుమాళ్ళు కుట్టి ఏదో పాతబట్టలు పొదుపు చేస్తున్నా మనుకుంటారు. అలా అది మార్చి ఇదిమార్చి అది కట్టుకుంటె కుట్టిన వాళ్ళ కిటుకు కదా కాలం వృథా, దారం వృథా ఎక్కడ చూచినా పాతబట్టలే ఎప్పుడు చూచినా కుట్టుకోవడమే. అలా కాకుండా టేబుల్ క్లాత్‌లు, కర్టెన్లులాంటివి రంగు వేసి జరీలైన కొత్తవే కొనుక్కుంటె మాసినప్పుడల్లా చక్కగా లక్సు పౌడరుతో శుభ్రం చేసికోవచ్చు. చూడడానికా యిల్లు పరిశుభ్రంగా చూడముచ్చటగా ఉంటుంది.

ఇంట్లో వున్న పాతబట్టలిచ్చి స్టెయిన్‌లెస్ స్టీల్ సామాన్లు కొనుక్కుంటె డబ్బు పెట్టి కొనకుండా గిన్నెలూ లభిస్తాయి. మన మిచ్చిన పాతబట్టలకన్న ఎంతో ఎక్కువ కాలం అంటే కొన్ని సంవత్సరాలు మన్నుతాయి. గిన్నెలా వెండి గిన్నెలులా ఉండి అన్నిటికి వుపయోగిస్తారు. ఇత్తడి గిన్నెలలా కళాయిబాధ అక్కరలేదు. కొందరు పాత బట్టలుపెట్టి కొంటే నష్టమనుకుంటారు. కాని నిజంగా ఆలోచిస్తే ఈ గిన్నెలు మన్నినంత కాల మాపాతబట్టలు మన్నవు. చూడడాని

* * *

## వింటమాటలు

మనం నలుగురం కలిసి ఓచోట మాట్లాడు కునేటప్పుడుగానీ, మంచి విషయం చర్చించుకునేటప్పుడుగానీ, ఎవరిని గురించయినా చెప్పుకునేటప్పుడుగానీ, ఒకళ్ళ కంటే ఒకళ్ళు ముందు చెప్పాలని, తనకే ముందు చెప్పెయ్యాలని గాబరా పడిపోయి, ఒకళ్ళమీద ఒకళ్ళు పడిపోతూ, సక్కతిప్పకోలేకుండా మాట్లాడడానికి ప్రయత్నిస్తో వుంటారు. అటువంటప్పుడు ఒక్కొక్క చోట సక్కతిప్పకో లేక, నోరు తిరక్క నానా అవస్థపడి వంకరమాటలు వత్తి మాటలు ముద్దమాటలు ఆడి ఎదుటి వాళ్ళ పొట్టలు చెక్కచేసి, తామునలుగురిలో చిన్నతనముపొంది కోపమొచ్చి, అక్కడనుంచివెళ్ళిపోవడమో, లేక దెబ్బలాడటమో జరుగుతుంది.

మొన్న మేమంతా నలుగురు స్నేహితులం కలిసికూచుని లోకాభిరామాయణంమాట్లాడు కుంటోంటే ఇటువంటి విషయాలే సంప్రాప్త మయ్యాయి మాకు. మా పక్కింటి ఆవిడ వాళ్ళదొడ్లో (దొడ్లో) కాకరకాయలు (కాకర) ఎండి (ఎన్ని) కాచాయో! (కాశాయో) అంది. మరో ఆవిడ మాపిల్లలు ఆరునెల్ల పడితుకి (పరీక్షకి) వెళ్ళివస్తోంటే నుక్కపెక్క పక్కనే తంతదిగ్గరకి (పట్టుకనేటంత) ఒప్పిందండీ (ఒచ్చిం) అంది. మేమంతా నవ్వు ఆపుకోలేక, గట్టిగా నవ్వ

(56-వ పేజీ చూడండి)

## 'పెన్‌ఫ్రెండ్' కోసం

దక్షిణాఫ్రికా జోహాన్స్‌బర్గ్ నగరానికి చెందిన ఒక యూరపియన్ బాలిక మన దేశపు బాలబాలికల మైత్రి కోరుతూ ఒక లేఖ వ్రాసింది. మిత్రులు ఎంత దూరాన ఉన్నా ఉత్తరాల ద్వారా ఒకరి యోగక్షేమాలు ఒకరు తెలుసుకోవచ్చును. మన దేశపు మంచిచెడ్డలు, మన అభిమాన విషయాలపై మన అభిప్రాయాలూ వాళ్ళకి తెలిపి, వాళ్ళ ఉద్దేశాలు తెలుసుకుంటూ ఉండవచ్చును. ఈ విధంగా ఎన్నోవేల మైళ్ళదూరాన ఉన్నవాళ్ళను మనం ఆప్తమిత్రులం కావచ్చును. ఇలా చెలిమి కలుపకోరేవారు తనకు లేఖలు వ్రాయాలని ఈ అమ్మాయి కోరుతోంది.

"నా వయస్సు 17 సంవత్సరాలు. ఫోటోగ్రఫీ, స్టాంపులు సేకరించడం అంటే నాకు చాలా యిష్టం. వీటిమీద అభిమానం ఉన్నవాళ్ళు నాకు లేఖలు వ్రాసి స్నేహం చేదామని అభిలషిస్తున్నాను. అందువల్ల మీ పాఠకులకు ఈ సంగతి తెలుపగోరుతున్నాను" అని ఆ అమ్మాయి వ్రాసింది.

ఆమె పేరు: మిస్ జోన్ కార్ సెన్. చిరునామా: 10, Sixth Street, Linden, Johannesgurgh, Transwaal, South Africa (లేఖలు ఆంగ్లంలోనే వ్రాయాలి).




# గుడ్డి దర్బారు

ఆంధ్రా రాజాగారి
అవకతవక పాలనలో
ఖజానాలో డబ్బులేదు
ఖజానాపైన లెక్కలేదు
పేరుకేమొ ఉద్యోగులు
వేలకొలది గలరుగాని
ఉన్నవారి పనులేవో
ఊహించెడి వారులేరు!

పన్నులెంత వేసినను
ప్రజలేమా చెల్లింతురు
ఎంత డబ్బు వచ్చినను
ఇట్టె మటుమాయమౌను
ఏమి యీ విపరీతమనుచు
ఏలిక యోచనలుజేసి
కడకు దారి తెలియమిచే
కలవరంపెను పీడదొరకు.

అమానుషమ్మగు ప్రజ్ఞ
విశేషమ్ము తన సొత్తుగ
అర్థశాస్త్రమ్మునందు
అవధులు కనుగొన్న దొరకు
ఆంధ్రా రాజాగారి
ఆయవ్యయముల పట్టిక
బుర్ర చించుకొన్నగూడ
బోధపడక పోయెను!

శిరోభార మధికమించు
తలపుసు తోయుచు నాతడు
రాజభవన సమీపస్థ
రమణీయోద్యానమందు
తిరుగుచుండి, చిత్రమౌ
దృశ్యమొకటి చూచెను.

విరులతోడ క్రిక్కిరిసిన
తరువుల క్రీనీడలోన
చక్కగాను అమరియుండె
నొక్క శిలావేదిక
తొలిజామున నెట్టి పుణ్య
ములను చేసికొనిరోగాని
భటులిద్దరు దానిచెంత
భద్రముగా కావలా!

దొరగారా భటులచెంత
కరిగి యిట్లు ప్రశ్నించిరి:
"వేదికపై నెవరులేరు
వీరభటులు గదా మీరు!
దీనిపొంత వ్యర్థముగా
దినముల గడపంగనేల?
విశేషమెద్దియైన నున్న
వినవలచెద, వాక్రుచ్చుడు"

మొదటి భటుడు నోరుదెరచి
కథ నిట్టుల విన్నవించె
"అరువదేళ్ళ మాట, దీని
కప్పుడు రంగువేసిరంట!
రంగువేసి నారటన్న
సంగతి గుర్తించుకొనక
మహారాణి కూర్చొనగా
మలినమయ్యె జరీచీర!

రాణిగారి చీర యిక, ఆ
రాతి నంటగూడదంచు
భటునొక్కని రాజాగారు
పహారాకు నియమించిరి."
"ఇదా విషయ మటులైనచో
నీతని కథ ఏమి"టనగ
రెండవభటు డిట్టుల తన
వృత్తాంతము చెప్పదొడగె

"ఇరువదేళ్ళ క్రిందట యీశ
తిరుగుబాటు జరుగుటచే
ఈడు తనదు సిబ్బందిని
రెట్టింపుగ పెంచినాడు.
నాటనుండి నేనుగూడ
ఇట కావలియుంటి" నవగ
అర్థశాస్త్రవేత్త కతని
కాశ్చర్యము దాలగలిగె!

మదురాంతకం రాజారాం




(గతవారం తరువాయి)

గండు గ్రద్ద ఆ రాజ్యములో ఒక ఉన్నతమైన రాగిమేడపై వ్రాలి "మిత్రమా! ఇక్కడ నా పెద్దక్క నివసిస్తూ ఉంది. ఆమె అతిథులుగా మన మిచ్చట బసచేద్దాము. ఆమె నీకు అనేక బహుమతు లిస్తుంది. నీ వేమీ తీసుకొనక, ఆమె దగ్గరగల రాగిపెట్టె యిమ్మను" అని చెప్పింది. ఆ తరువాత గండు గ్రద్ద మానవ రూపము ధరించి వర్తకునితో

## నండూరి విఠల్ బాబు

"మిత్రమా! ఇంక నేను గండు గ్రద్దను కాను. నా పేరు సుందరుడు, సుమా!" అన్నది. సుందరుడు వర్తకునితో అంతఃపురములోనికి పోయాడు. సుందరుని పెద్దక్క రాగి రాణి వారిని చూచి ప్రేమతో ఆహ్వానించి "అన్నా! ఎన్నాళ్ళకు కనిపించావు! నిన్ను చూచి మూడు సంవత్సరములు దాటిపోయినది. నీ వే ప్రమాదమునకు గురియై మరణించావోయని భావించాను. అదృష్ట వశమున తిరిగివచ్చావు. ఇన్నాళ్లెచ్చట ఉన్నావు?" అని అడిగింది.

సుందరుడు తనకూ జంతువులకూ జరిగిన యుద్ధమునుండి జరిగిన కథంతా చెప్పి, తనను రక్షించిన దీవర్తకుడే నని యాతనిని పరిచయము చేశాడు.

ఆనాడు భవన మంతయు దివ్యముగా అలంకరించారు. రంగు రంగుల దీపములతో మిరుమిట్లు గొల్పు కాంతులు చిందుతున్నాయి. రాగిరాణి పంచభక్ష్య పరమాన్నాలు చేయించి అతిథులకు వడ్డించింది. విందయిన తరువాత రాగి రాణి వర్తకుని ధనాగారములోనికి తీసుకొనిపోయి "మిత్రమా! నీవు నా యన్న ప్రాణములను రక్షించావు. నీ ఋణము మేమెట్లు తీర్చుకొంటాము. ఇదుగో! నా ధనాగారములో వజ్రములు - రత్నములు - బంగారము అంతులేనంతగా ఉన్నాయి. నీకు వలసినంత తీసుకొని సుఖించు," అని అంది.

వర్తకునకు ఆ ధనరాసులను చూచినంతనే మూర్ఛవచ్చినంత పనయ్యింది. కొండలంత గుట్టలుగా ఆ ధనరాసులు పేరుకొని ఉన్నాయి. నూరుబస్తాల బంగారము కావలెనని చెప్పబోయాడు. ఇంతలో గండు గ్రద్ద చెప్పిన మాటలు గుర్తునకు

వచ్చి "రాగిరాణీ! నాకీ బంగారము, వజ్రములు - రత్నములు, అవసరము లేదు. నీ దగ్గరగల రాగిపెట్టె కావా" లన్నాడు.

ఆమాట విని రాగిరాణి నవ్వి "పిచ్చివాడా! సిరిరా మోకాలడ్డువా డెవడైనా ఉంటాడా! ఈ ధనరాసులు తీసుకుపోతే కుబేరునివలె ధనవంతుడ వవుతావు. రాగిపెట్టె నీకెందుకు?" అని ప్రశ్నించింది. ఏమైనా ఆ రాగిపెట్టె మాత్రమే కావాలని వర్తకుడు పట్టుపట్టాడు.

"ఆ రాగిపెట్టెమాత్ర మివ్వను" అని రాగిరాణి ముఖము ఆవలకు త్రిప్పుకొంది.

ఆ సమాధానము విని సుందరుడు సోదరిపై కినుక చెంది, తిరిగి పక్షిరూపము ధరించి, వర్తకుని వీపు మీద నెక్కించుకు వెడలిపోయాడు.

రాగిరాణి సోదరుడు వెడలిపోవు నపుడు "అన్నా! అన్నా!! కోపగించక తిరిగిరా. నీకై నా రాగిపెట్టెను ఆ వర్తకునకు యిచ్చివేస్తాను," అని కేకపెట్టింది. గండుగ్రద్ద "సమయము మించిపోయినది" అని చెప్పి ఆకాశములోని కెగిరిపోయింది.

మూడు గంటల మూడు నిమిషముల మూడు క్షణములు గడచిపోయెను.

గండుగ్రద్ద వర్తకునితో "మిత్రమా! నీ ముందు వెనుకల ఏమి కనిపించుతున్నదో చూడు" అన్నది.

వర్తకుడట్లే చూచి వెనుక మంటలనూ, ముందు పూలగుత్తులనూ, చూశానని చెప్పాడు.

"ఆ రాగి రాజ్యము తగులబడి పోతున్నది. ఆ మంట లవ్వటివే! ముందున్న పూలగుత్తులు వెండి రాజ్యములోనివి. అక్కడ నా రెండవ సోదరి నివసిస్తూఉంది. మన మిప్పుడచ్చట విశ్రాంతి తీసుకొందాము. నా సోదరి నీకనేక బహుమతులిస్తుంది. నీవు వాటిని తిరస్కరించి ఆమెదగ్గరగల వెండిపెట్టె కావాలని కోరుకో" అని చెప్పి ఒక ఉన్నతమైన వెండి మేడపై వ్రాలింది.

గండుగ్రద్ద తిరిగి సుందరుడై, వర్తకునితో అంతఃపురములోని కెళ్ళాడు.

వెండిరాణి సుందరుని చూసి ఆహ్వానించి ఆలింగనము చేసుకొని క్షేమసమాచారము అడిగింది.

సుందరుడు జరిగిన కథంతయూ జెప్పి తన ప్రాణమును కాపాడిన దీ వర్తకుడేనని యాతని పరిచయము చేశాడు.

ఆనాడు వెండిరాణి వారికి బ్రహ్మాండమైన విందు చేసింది. విందయిన తరువాత వెండిరాణి వర్తకుని తన ధనాగారములోనికి తీసుకొనిపోయి "మిత్రమా! నా అన్న ప్రాణము రక్షించి మాకు మరువలేని మేలుచేశావు. ఇవిగో రత్నములు, వజ్రములు, వైడూర్యములు - అదిగో బంగారము - వెండి - నీకు వలసినంత తీసుకొని, జీవితాంతమువరకు సుఖించు" అన్నది.

వర్తకుడు గండుగ్రద్ద చెప్పినట్లు ఆ ధనరాసులేమీ వద్దన్నాడు.

అట్లైతే నీకేమి కావాలని వెండిరాణి ప్రశ్నించగా వర్తకుడు తనకు ఆమెదగ్గరగల వెండిపెట్టె కావలెనని చెప్పాడు.

వెండిరాణి కోపముతో "మూర్ఖుడా! నే నిన్ని ధనరాసులిస్తుండగా, తిరస్కరించి వెండిపెట్టె కోరుతున్నావు. అది నీకు లభించదు పో" అన్నది.

వెండిరాణి చెప్పిన మాట విని సుందరుడు కోపగించుకొని తిరిగి గండుగ్రద్దగా మారి వర్తకుని వీపుపై నెక్కించుకొని ఎగిరిపోయాడు.

వెండిరాణి "అన్నా! అన్నా! నీకింత కోపము వస్తుందని భావించలేదు. ఇదిగో నా వెండిపెట్టె-వచ్చి తీసుకుని నీ మిత్రునకు బహూకరించు" అని ఎలుగెత్తి పిలిచింది.

గండుగ్రద్ద "సమయము మించిపోయింది" అని సమాధానము చెప్పి ఆకాశములోని కెగిరిపోయింది.

మూడు గంటల మూడు నిమిషముల మూడు క్షణములు గడచిపోయింది.

గండుగ్రద్ద వర్తకునితో "మిత్రమా! నీ ముందు వెనుకల నీకేమి కనబడుతోందో చెప్పు" అన్నది. వర్తకుడు ముందు వెనుకల చూచి వెనుక అగ్నిజ్వాలలు, ముందు పువ్వులతీగెలు కన్పిస్తున్నవని చెప్పాడు.

గండుగ్రద్ద "ఆ వెండిరాజ్యము తగులబడిపోతున్నది. నీవు చూచిన పువ్వులతీగెలు బంగారు రాజ్యములోనివి. నా చిన్నచెల్లెలు అచ్చటనే నివసిస్తూ ఉన్నది. ఆమె నీ కనేక బహుమతులు నిస్తుంది. నీవు వాటిని తీసుకొనక, ఆమెదగ్గరగల బంగారు పెట్టెను యిమ్మని అడుగు" అని చెప్పింది.

గండుగ్రద్ద వర్తకునితో ఉన్నతమైన బంగారు మేడపై వ్రాలి, సుందరుని రూపమును ధరించి వర్తకునితో అంతఃపురములోనికి వెళ్ళగానే,

బంగారు రాణి వారి నాహ్వా

# ★ అపూర్వసుందరి ★

నించి "అన్నా! నేను నీకోరకు ఒళ్లంతా కళ్లుచేసుకొని ఎదురు చూస్తున్నాను. ఇన్నేళ్లు ఎచ్చట ఉన్నావు? ఏ కష్టము లనుభవించావు?" అని ప్రశ్నించింది.

సుందరుడు తనకథంతా చెప్పి, తన ప్రాణములను రక్షించిన మిత్రుడితడేనని వర్తకుని చూపెట్టాడు.

ఆనాడు బంగారురాణి అతిథులకు గొప్ప విందు చేసింది. విందయిన తరువాత బంగారురాణి వర్తకుని తన ధనాగారమునకు తీసుకుపోయి కోట్లకొలది ధనరాసులను జూపి నీకు వలసినంత తీసుకుపొమ్మన్నది.

వర్తకుడు గండుగ్రద్ద చెప్పిన ప్రకారం, తనకేమి వలదన్నాడు. బంగారురాణి ఆశ్చర్యముతో "మిత్రమా! నా అన్న ప్రాణము రక్షించితివి. నీ ఋణ మెట్లు తీర్చుకొంటాను? నీ కేమి కావలెనో కోరుకో. నా ప్రాణములనైన నీకు బహుమతిగా ఇస్తాను" అన్నది.

వర్తకుడు "నీ దగ్గరగల బంగారు పెట్టె ఇ"మ్మని అడిగాడు.

"అలాగే తీసుకో. నా పంచప్రాణములలో ఒకటిగా భావించుతున్న నా యన్న ప్రాణము రక్షించావు. నీకు ఆ బంగారుపెట్టె మేలు చేయు గాక!" అని ఆశీర్వదించి బంగారురాణి, తన ప్రాణప్రదముగా దాచుకొంటున్న బంగారు పెట్టెను వర్తకునకు యిచ్చివేసింది.

సుందరుడు వర్తకునితో "మిత్రమా! ఈ బంగారుపెట్టె తీసుకొనిపో. ఇల్లు చేరేవరకు యీపెట్టెను తెరవవద్దు సుమా! నీకు మేలు కలుగుతుంది," అని చెప్పి పంపివేశాడు.

వర్తకుడు ఆ బంగారు పెట్టెతో యింటికి బయలుదేరాడు. కొండలను, అడవులను దాటి నడుస్తున్నాడు. అట్లు కొంత దూరము పోగానే, వర్తకుడు అలసిపోయాడు. ఒక చెట్టుక్రింద విశ్రాంతి తీసుకొనుటకై నడుము వాల్చాడు.

ఆ బంగారుపెట్టెలో ఏమున్నదో తెలుసుకోవలెనను ఆరాటము అతనికి కలిగింది. కాని సుందరుడు చెప్పిన మాట తలచుకొని కొంచెము సేపు ఊరుకున్నాడు. చివరకు పెట్టెలో ఏ మున్నదో తెలుసుకోవలెననెడు కుతూహలము ఎక్కువై వర్తకుడు పెట్టెను తెరిచాడు.

బంగారు పెట్టెను తెరువగానే, అందుండి బుడగలు బుడగలుగా గాలి బయటికివచ్చి కండ్లు మూసి కండ్లు తెరచునంతలో ఒక బ్రహ్మాండమైన బంగారు మేడైపోయింది, అందులో వేలాది నౌకర్లు, దాసీలు వర్తకునికై ఎదురు చూస్తున్నారు.

కొందరు పరిచారికలు వర్తకుని దగ్గరకువచ్చి "ప్రభూ! తమ కేమి కావాలి?" అని అడిగారు.

వర్తకుడు దాహముగా ఉన్నదన్నాడు. అప్సరసలు చల్లని కొబ్బరి నీరు బంగారుగిన్నెలతో యిచ్చారు. ఆ తర్వాత పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం పెట్టారు. వర్తకుడు కడుపునిండా భోజనంచేసి హంసతూలికా తల్పముపై పడుకొన్నాడు. బహుదూరము నడచి, బడలికచెంది ఉండుటచేత అతనికి వెంటనే గాఢమైన నిద్రపట్టింది.

అది ఒక మాయారాజ్యం. ఆ రాజ్యపు రాజైన మాయావి అనేవాడు, తన రాజ్యంలో క్రొత్తగా వెలసిన బంగారుమేడను చూచి ఆశ్చర్యపోయి, తన భటులతో ఒక సందేశం పంపించాడు.

వర్తకు డాసందేశము నిట్లు చదువుకొన్నాడు. "నా రాజ్యంలో నా అనుమతి లేక, నీవు మేడకట్టుటకు వీలులేదు. తక్షణము నీవు యీ ప్రదేశము వదలి లేచిపోవలెను. లేని యెడల నాసైన్యములను పంపి నిన్ను చిత్రవధ చేయిస్తాను."

వర్తకున కేమిచేయటానికి తోచలేదు. బంగారుపెట్టెలోనికి తిరిగి బంగారు మేడను పంపటం యెట్లాగా అని అతడు ఎంత ఆలోచించినా ఏమీ పాలుపోలేదు.

మాయావికి వర్తకుడు చివరికొక ప్రతి సందేశం పంపాడు. "రాజా! నాకు పోవాలనే ఉన్నది. కాని బంగారుపెట్టెలోనికి ఈ బంగారు మేడను తిరిగి ఇముడ్చు టెట్లో తెలియటంలేదు."

రాజభటులు తిరిగిపోయి మాయావి కీవిషయం విన్నవించారు.

మాయావి వర్తకుని పిలిపించి "ఓ పరదేశీ! నీవింటికి వెళ్లేనరికి నీకు తెలియకుండా నీకు కలిగి ఉండిన అదృష్టమును నాకిచ్చివేస్తే నీమేడను తిరిగి బంగారుపెట్టెలోనికి ఇముడ్చి పంపించగలను" అన్నాడు.

వర్తకుడు చేయునదిలేక, మాయావి షరతునకు ఒప్పుకొన్నాడు. మాయావి తన మంత్రములచే తిరిగి ఆ బంగారు సౌధాన్ని బంగారుపెట్టెలో నిముడ్చి వర్తకునకిచ్చి పంపివేశాడు.

(ఇంకా వుంది)

# రాత తెలుసుకుంటే

వింధ్యపర్వత ప్రాంతంలో పూర్వం ఒకమహర్షి ఆశ్రమం ఏర్పరచుకుని వుంటూ వుండేవాడు. మహర్షి చాలా నిష్ఠగలవాడూ, తపశ్శాలీనూ. మహర్షికి భార్యవున్నది—బిడ్డలులేరు. ఐతే, బుద్ధిశాలి అనే శిష్యుడొకడు మహర్షి యింట్లోనే వుంటూ, ఆయన సేవచేస్తూ శిష్యరికంలో వుంటున్నాడు. బుద్ధిశాలి మీద మహర్షికీ ఆయన భార్యకూ కూడా చెప్పలేనంత ప్రేమ! పోతే, బుద్ధిశాలికూడా ఎప్పుడూ ధ్యానంలో వుంటూ, తపస్సు చేసుకుంటూ వుంటాడు.

కొన్నాళ్ళకు మహర్షి భార్య గర్భం ధరించింది. నవమాసాలూ నిండి, కానుపువేళ ఐంది. ఆరోజు ఏదో పనిమీద మహర్షి బయటకు పోతూ బుద్ధిశాలిని పిల్చి - "ఇదిగో నాయనా! నేను పనిమీద వెళుతున్నాను. నువ్వు జాగ్రత్తగా ఇంటి ముందు కాపలావుండి, ఎవర్నీ లోపలకు పోనివ్వకు. కానుపువేళ-గుమ్మం ముందే నువ్వు కూచోవాలిసుమా!" అని హెచ్చరించాడు. "అల్లాగే మహాత్మా - తప్పక వుంటాను. బ్రహ్మదేవుడొచ్చినాసరే లోపలకు పోనివ్వను!" అన్నాడు బుద్ధిశాలి. మహర్షి వెళ్లిపోయాడు. ఆశ్రమ ద్వారం దగ్గరకూచుని ఏదో ఆలోచిస్తున్న బుద్ధిశాలికి ఇంట్లోంచి పాపాయి ఏడుపు వినిపించింది. బుద్ధిశాలి ఎంతో సంతోషంలో మునిగిపోయాడు. "నాకు తమ్ముడు పుట్టాడా!" అనుకున్నాడు, మనసులో.

ఇంతలో అతనికి ఎవరో వస్తున్న అడుగుల చప్పుడు వినిపించింది. తలెత్తి చూశాడు. ఎవరూ కనిపించలేదు. చప్పుడు మాత్రం దగ్గరగా వస్తున్నది. వెంటనే బుద్ధిశాలి దివ్యదృష్టితో చూడగా నాలుగు తలలుగల ఒకాయన, వెలిగిపోతూ ఆశ్రమంలోకి అడుగుపెట్టబోతున్నాడు.

"ఆగాలి!" అన్నాడు బుద్ధిశాలి.

అతను ఆగిపోయి, తనను గమనించిన వ్యక్తెవరోనని చూడసాగాడు.

సుకుమార్

"ఎవరునువ్వు?" అన్నాడు బుద్ధిశాలి తెలిసే.

"నేను బ్రహ్మను"

"ఐతే కావొచ్చు. ఇక్కడేం పని?" అన్నాడు బుద్ధిశాలి.

"ఈ యింట్లో ఇప్పుడే జననం జరిగింది. ఆబిడ్డ యోగం ఏమిటో పోయి, ఆతని నొసట రాయాలి!" అన్నాడు బ్రహ్మ.

"సరే, ఆయనలేరు. మళ్ళీ రండి" అన్నాడు బుద్ధిశాలి.

బ్రహ్మదేవుడికి కోపంవచ్చింది. సృష్టి మొదలుకుని, ఈ నాటిదాకా కూడా ఇటువంటి సమయాల్లో తనను ఎవడూ అడ్డుపెట్టలేదు. అటువంటిది ఈ శిష్యుడెవడో తనను అగౌరవంగా చూడటం ఆయనకు మంట కలిగించింది. ఐనా, తగ్గి -

"చూడు నాయనా! ఇది నా విధ్యుక్త ధర్మం. ప్రతి జీవరాశికీ ఇట్లా నేనుపోయి రాయాల్సిందే. అంచాత ఇంటాయన ఇక్కడవుండాల్సిన పనేమీలేదు. నన్నుపోనీ!" అన్నాడు.

బుద్ధిశాలిఆలోచించాడు. ఎవర్నీ పోనివ్వవద్దని గురువుగారు చెప్పిన మాట నిజమే ఐనా, ఈ బ్రహ్మను వదిలిపెట్టకపోవటంలో అర్థం లేదు! ఇది బ్రహ్మదేవుడు చిరకాలంగా చేస్తున్న విధి! ఇప్పుడిది తనుకాదనటం బాగుండదు.

"సరే ఐతే, లోపలకుపోవచ్చు. కానీ, ఆ బిడ్డ నుదుటిమీద ఏం రాస్తారో నాతో చెప్పండి. లోపలకు పోనిస్తాను." అన్నాడు బుద్ధిశాలి.

"అది చెప్పకూడదు" అన్నాడు బ్రహ్మ.

"ఐతే పోవటం కష్టం అన్నాడు శిష్యుడు.

బ్రహ్మదేవుడికి చిరాకుపుట్టింది. తనొచ్చి అప్పుడే చాలావేళయింది. ఇక్కడ ఇట్లా బాతాఖానీవేస్తూ కూచుంటే మిగిలిన పనులన్నీ ఏం కావాలి? ఈ మునులతో ఇదే చిక్కు. పిల్లకు తెలీదు-గట్టిగా ఎదిరించామా-శాపాలతో బెదిరిస్తారు. 'శాపం' అనేమాట గుర్తు రాగానే బ్రహ్మదేవుడు తగ్గిపోయి—

"సరే, రాసివచ్చి చెబుతాను. ఐతే ఆ సంగతి రెండో మనిషికి తెలియరాదు. ఎవరికన్నా చెప్పావంటే, నువ్వు అపాయాలలో ఇరుక్కో

 రాత తెలుసుకుంటే 

వలసివస్తుంది" అన్నాడు.

"అట్లాగే. పోయిరండి!" అని విడిచిపెట్టాడు బుద్ధిశాలి బ్రహ్మను.

పనిపూర్తిచేసుకొని రెండు నిమిషాల్లో తిరిగి వచ్చాడు బ్రహ్మ.

"చెప్పండి - ఏం రాశారు?" అన్నాడు బుద్ధిశాలి.

"ఈ అబ్బాయి నిర్భాగ్యుడు" అన్నాడు బ్రహ్మ జాలిపడుతూ.

"అబ్బాయే కలిగాడా!" అని సంతోషంగా అని వెంటనే "నిర్భాగ్యుడా?" అనడిగాడు బుద్ధిశాలి.

"అవును క్రూరవాడు చెడుసహవాసాల్లో చెడిపోతాడు, విద్యరాదు. పైగా ధనసంపాదనకు మార్గం కూడా..."బుద్ధిశాలికి కోపంవచ్చింది

"ఎందుకట్లా రాశారు?" అన్నాడు.

"పూర్వజన్మంలో చేసుకున్న పాపం, ఈ జన్మలో అనుభవించాల్సిందే. తప్పదు అన్నాడు బ్రహ్మ.

"మరెట్లా బతుకుతాడు?"

"అతనికి ఓబండీ, రెండెద్దులూ నిత్యం వుంటాయి. వాటివల్ల వచ్చే ఆదాయంతో బ్రతకాలి! సరే, నేను పోయివస్తాను" అని బ్రహ్మ దేవుడు వెళ్లిపోయినాడు. బుద్ధిశాలికి విచారం పట్టుకున్నది. ఇదేమిటి పాపం - లేకలేక ఇట్లా పిల్లవాడు కలిగి, వాడు భూమ్మీద సుఖపడక, కష్టాలపాలవుతాడా! అనుకున్నాడు. సరే, అని వూరుకున్నాడు. జరిగిన సంగతిని గురించి ఎవరితోనూ అతను అనలేదు!

రెండేళ్లు గడిచిపోయినై. అబ్బాయికి భాగ్యశాలి అని పేరుపెట్టారు. ఈ పేరువినగానే బుద్ధిశాలికి ఎందుకో నవ్వొచ్చింది. తర్వాత మహర్షి భార్య మళ్లీ గర్భం ధరించింది. కాన్పువేళకు గురువుగారు ఇంట్లోనే వున్నారు. ఈసారి బుద్ధిశాలి ఆ బ్రహ్మకోసం తానే కనిపెట్టుకు కూచున్నాడు. పైగా ఇంటి గుమ్మానికి ఐదారు గజాలు అవతలే వున్నాడు. వేళయేసరికి బ్రహ్మ రానే వచ్చాడు. "ఇదిగో-మీరు ఈ సారి ఇష్టం వచ్చినట్టు రాశారంటే మంచిమాటకాదు. కాస్త జాగ్రత్తగా రాయండి!" అన్నాడు బుద్ధిశాలి. బ్రహ్మకు ఆశ్చర్యం కలిగింది.

"మళ్ళీ ఇక్కడే వున్నావా నాయనా! ఏమైనా నా చేతిలో ఏమీ లేదు. పోయి చూసిరాస్తీ సాధ్యమైనంతవరకూ మంచిగానే రాస్తాలే! ఐనా పాపులయినప్పుడు పాపాలు అనుభవించవద్దానాయనా. నీకు తెలియనిది ఏముంది?" అంటూనే బ్రహ్మ లోపలకుపోయి, తిరిగివచ్చి - "ఈసారి ఆడపిల్ల పుట్టింది. చాలా అందగత్తెగా పేరు పొందుతుంది. పెళ్లి చేసుకోక వేశ్యగా జీవిస్తుంది. ఆ ధనమే జీవనాధారం" అనేసి బ్రహ్మ చరచరా వెళ్లిపోయినాడు. బుద్ధిశాలికి అంతా అగమ్యగోచరంగా కనిపించింది. 'కానీ చూదాం' అనుకున్నాడు.

కొన్ని సంవత్సరాలు గడిచి పోయినై. మహర్షి, భార్య చని పోగా ఇద్దరి బిడ్డల్నీ సాకవలసిం దిగా బుద్ధిశాలికి వప్పజెప్పి తన వింధ్యప్రాంతాలకు తపస్సుకోసం పోయాడు. తన జీవితం అక్కడే ముగుస్తుందనీ, తనకోసం ఎవరు చూడక్కర్లేదనీ కూడా చెప్పాడు. తర్వాత కొన్నాళ్లకు భాగ్యశాలి పెద్దవాడైనాడు. ఇరవై సంవత్సరాలు వచ్చినై. ఎన్ని విద్యలు చెప్పినా తలకెక్కవికావు. ఎప్పుడు అల్లరీ ఆగడమూ తప్ప ఇంకేం లేదు. భాగ్యశాలి చెల్లెలు మనోహారి పద్దెనిమిదేళ్లు వచ్చినై. ఈలోగ బుద్ధిశాలి వివాహం చేసుకు వేరేగావుంటూ, అప్పుడప్పుడు గురువు గారి పిల్లల్ని చూస్తూ పోతూవుం వాడు. కొన్నాళ్లకు మనోహారి వూరు విడిచిపెట్టి ఒకపట్నం వెళ్లి పోయింది. ఒకబండీ, రెండుఎద్దులు సంపాయించి వాటిని బాడుగకి తోలుకుంటూ ఆరాబడితో కష్టంగా జీవితం వెళ్లబుచ్చుతున్నాడు భాగ్యశాలి.

మనోహారి వేశ్యగా జీవిం

సాగింది. ఈ డబ్బు చాలక, బీదజీవి తాన్నే గడుపుతున్నది!

బుద్ధిశాలి ఈ ఇద్దరి జీవితాలనూ బాగా పరిశీలించాడు. పాపం! భాగ్యశాలికి బండి బాడుగ ఒక్కొక్కనాడు రాదు. ఆరోజు పాపం అతను తిండికిలేక బాధపడతాడు. మనోహారి అంతే! తుచ్ఛమైన జీవితాన్ని వెళ్ళబుచ్చుతున్నా, తిండికి కరవైపోతున్నది.

అతను తీవ్రంగా ఆలోచించి ఒక రోజు భాగ్యశాలిని చూడవచ్చి "నాయనా! నేనొకపని చెబుతాను చెయ్యి. నీకున్న రెండు ఎద్దులూ, బండీ అమ్మెయ్. ఎంతకన్నా సరే" అని సలహా చెప్పాడు. ఈ మాటకు భాగ్యశాలి ఉలిక్కిపడి "ఉన్నదేదో అమ్ముకుంటే పొట్టగడిచేదెట్లా?" అన్నాడు. "ఆమార్గంఅదే తెలుస్తుంది. నామాటవిని ఆ రెండూ అమ్మేసేయ్. నేను చూస్తాగా తర్వాత విషయం" అన్నాడు. ఆ రోజు భాగ్యశాలి బండినీ, రెండెద్దులనూ సంతలో అమ్మేశాడు. కాస్త ధనం చేతికి రాగానే అతను సంతోషపడ్డాడు. ఐతే, ఈ డబ్బు ఐపోగానే ముందేం చెయ్యాలి? అదే అతనికి అర్థంకాలేదు.

బుద్ధిశాలి పన్నినపన్నాగం ఇది- బ్రహ్మదేవుడు చెప్పిన వాక్యం ప్రకారం 'నిత్యమూ భాగ్యశాలికి బండీ ఎద్దులూ వుంటాయి. వాటి వల్ల వచ్చే ఆదాయమే అతనికి బ్రతుకు తెరువు.' అంచాత బండీ ఎద్దులవల్ల అమ్మగా వచ్చిన ఆదాయం ఎక్కువయింది. పోతే బ్రహ్మ వాక్కు ప్రకారం అతనికి ఎప్పుడూ బండీ ఎద్దులూ వుంటూ వుండాలి!

సంతలో బండీ ఎద్దులూ అమ్మేయగానే బ్రహ్మలోకంలో వున్న బ్రహ్మదేవుడు ఒకసారి దిగ్భ్రమ చెందిపోయినాడు. ఇదేమిటి - తన రాతకు ముప్పు వచ్చేట్టుందే! ఆ రాత్రే లేచి, ఒక బండీ రెండు ఎద్దులూ భాగ్యశాలి దొడ్లో సృష్టించి వెళ్ళిపోయాడు. తెల్లవారేసరికి ఈ రెండూ అనుకోకుండా కనిపించేసరికి, ఈబండీ, ఈ ఎద్దులూ ఎట్లా వచ్చాయా అని ఆశ్చర్యపోయి భాగ్యశాలి బుద్ధిశాలితో చెప్పాడు. బుద్ధిశాలి తన పాచిక పారినందుకు నవ్వుకున్నాడు. "నీకేం భగ్యాలేదు. ఈ రెండూకూడా ఈ రోజు అమ్ము. ఐతే మళ్ళీ కొత్త వస్తువులు ఎట్లా వస్తున్నయ్యాని మాత్రం నన్నడక్కు. ఆ విషయమై నువ్వు ఏమీ ఆత్రుతపడకు, రోజూ మాత్రం నువ్వు అమ్మేస్తూ, ఆ ధనంతో హాయిగా వుండు!" అన్నాడు బుద్ధిశాలి.

అటు మనోహారితోనూ అట్లాగే చెప్పాడు—"నువ్వు ఏమీ చింతపడ నవసరంలేదు. నీ పొట్ట హాయిగా గడిచేమార్గం చెబుతాను. ఒకటి

(56-వ పేజీ చూడండి)

# సినిమా

## గగనకుసుమం

సరుకు తయారుచేయడం ఒక ఎత్తు, దాన్ని అమ్మజూపి డబ్బు చేసుకోవడం మరో ఎత్తు. ఏ పరిశ్రమలోనైనా ఈ రెండూ ముఖ్యమైనవే.

సినిమా పరిశ్రమలో మటుకు కొంతకాలం క్రితం పరిస్థితి ఇలా వుండేదికాదు. అప్పట్లో శ్రమా, ఆందోళనా, అన్నీ పూర్వభాగ కార్యక్రమంలోనే—అనగా నిర్మాణంలోనే ఎక్కువ వుండేవి. చిత్రం నిర్మిస్తే, దాన్ని ప్రదర్శించడానికి చోటు సులభంగా దొరికేది. ఆపైన డబ్బుకూడా దొరికేదా అన్నది వేరే విషయం. అసలు చోటు ముఖ్యంగదా. అది సులభంగా దొరికేది. చిత్రం బలాబలాలను బట్టి జయాపజయాలు లభించేవి.

ఇప్పుడు కథ మారిపోయింది. ఈ పరిస్థితి వేరు. ఫిలిం పరిశ్రమ సర్వతోముఖంగా వృద్ధి చెందుతోంది. పరిశ్రమలో తిరిగే డబ్బు పెరుగుతోంది. సాలీనా తయారయే చిత్రాల సంఖ్య పెరుగుతోంది. వీటన్నిటితో పాటు పెరగనిదల్లా థియేటర్ల సంఖ్య ఒకటే. దీనివల్ల జరిగిందేమిటి? గిరాకీ పెరిగింది.

*　　*　　*

'సినీమాకి డబ్బెలాగయినా పుట్టిస్తాంగాని, థియేటరులో చోటుసంపాయించడం మహా గడ్డుగా ఉంది' అంటున్నారు. ఈ వ్యాపారంలో కష్టసుఖాలు తెలిసినవారు. మంచి పలుకుబడిఉన్న కొద్దిమందికి తప్ప, చిన్న చిన్న నిర్మాతలకు, కొత్తవారికీ ఇది పెద్ద సమస్య అయిపోతోంది. ఒక చిత్రం విడుదలకు చోటు దొరికి, అది ఒకమోస్తరుగా నడుస్తున్న ముఖ్యకేంద్రాలలో దానికి ఆటే కాలం ఆయుర్దాయం లేకుండా పోతోంది. ఎందుకు అంటే వరసలో ఇంకా బోలెడు కొత్తచిత్రాలు కాచుకుని ఉన్నాయి. చిత్ర పరిశ్రమలో కాచుకోవడం అంటే ఖర్చు అని అర్థం. నాలుగైదు లక్షల రూపాయల భవిష్యత్తు ఆ చిత్రంతో ముడిపెట్టుకు ఉంటుంది. అది కదిలేగాని ఇది తేలదు. ఈ లోగా వడ్డీ పెరుగుతుంది. అందువల్ల ఎవ్వరి తొందరవారిది. 'ఏ సెంటర్లు' అనబడే ముఖ్య కేంద్రాలలో పరిస్థితి ఇది. ఇక ద్వితీయ



నేషనల్ ఆర్ట్ థియేటర్స్‌వారి 'శ్రీ పాండురంగ మహాత్మ్యం'లో అంజలీదేవి, రామారావు.

శ్రేణి కేంద్రాలలో ప్రవేశం మరింతకష్టం. అనేక చిత్రాలకు ఇవి ప్రాణదాతలవంటివి. నెమ్మదిమీద డబ్బు రాబట్టుకోవలసిన చిత్రాలు ఇక్కడ లిఫ్టువేయాలి. ఆ తరువాతి కోవకు చెందిన చోట్ల చోటు అట్టే ఇబ్బంది లేకపోయినా అవి కొత్తచిత్రం జయాపజయాలు తేల్చే స్థానాలు కావు.

ఈ పరిస్థితులలో 'లైన్ క్లియర్' కోసం ఎదురుతెన్నులు చూస్తూ, పోటీ ధాటి లేకుండా చిత్రాన్ని వదలాలని చిన్న నిర్మాతలు ఎందరో కాసుకుని ఉండవలసివస్తోంది. ఒకొక్కసారి చిత్రనిర్మాణం పూర్తి అయిన మూడు నాలుగు నెలలవరకూ విమోచనం కనబడదు. దేశం అంతటా దాదాపు ఇదేపరిస్థితి ప్రవర్తిల్లుతోంది.

తెలుగుదేశానికి సంబంధించినంతవరకూ రద్దీ చాలాఉందని చెప్పుకోవాలి. ఎందుకంటే, తెలుగుచిత్రాలతోపాటు ఇక్కడ హిందీచిత్రాలు కూడా విరివిగా విడుదల అవుతాయి. ఇవికాక అడపాతడపా అమెరికన్ చిత్రాలుంటాయి.

ఒకొక్క చిత్రం ప్రధాన కేంద్రాలలో పదివారాలు ఆడితే చెప్పుకోతగ్గ ఆర్థిక విజయం సాధించినట్లవుతుంది. నెలకు మూడు నాలుగు చిత్రాలు విడుదల అవుతున్నప్పుడు, ఆడుతున్న చిత్రాలలో ఒకటిరెండైనా కొంత త్వరగా వైదొలగడం తప్పనిసరి అవుతుంది. మరి నాలుగు రోజులు ఆడి మరి నాలుగు డబ్బులు చేసుకోవడానికి గల అవకాశాలు తగ్గిపోతున్నాయి.

ఇది ఇలా ఉండగా, ఉత్తమమైన విదేశీయ చిత్రాలను, దేశంలోని ఇతర రాష్ట్రాల చిత్రాలను డబ్ చేసిగాని, కామెంటరీ సమకూర్చిగాని ప్రదర్శించాలని అభిలషించే వారికి 'థియేటర్‌లో చోటు' అనేది గగనకుసుమం అనిపిస్తోంది. మహా అయితే ఉదయపు వేళల వీలు దొరుకుతుంది.



'ఫరిస్తా' చిత్రంలో మీనాకుమారి, అశోక్‌కుమార్.

ఇంతరద్దీ ఉండడం వర్థిల్లే పరిశ్రమకు మంచిదికాదు. బాధ్యతాయుతులైన చలనచిత్ర పరిశ్రమ నాయకులు, ప్రభుత్వంకూడా ఈ 'సమస్య'ను (ఇది క్రమంగా 'సమస్య' అనిపించుకునే స్థాయికి వస్తోంది.) పరిశీలించి కొత్త థియేటర్ల నిర్మాణం విషయం ఆలోచించడం వాంఛనీయం. 

# మనదేశం ఘనవిజయం
## 'అపరాజిత'కు వెనిస్ ఉత్సవంలో ప్రథమ బహుమతి

'పథేర్ పాంచాలీ' స్రష్ట సత్యజిత్ రాయ్ మరోకసారి అంతర్జాతీయ శ్రేణిలో మన దేశానికి అగ్రస్థానం సంపాదించిపెట్టాడు. ఈసారి, ఆయన రెండవ చిత్రం 'అపరాజిత', ప్రపంచ చలనచిత్రోత్సవాలలో అగ్రశ్రేణిదైన వెనిస్ ఉత్సవంలో ఉత్తమ చిత్రంగా ఎన్నికఅయి, దేశదేశాల మన్ననలూ, వాటికి చిహ్నంగా, ప్రథమ బహుమతి పేరిట సువర్ణ సింహ విగ్రహాన్ని అందుకొన్నది. (శ్రీ రాయ్ తొలిచిత్రం "పథేర్ పాంచాలీ" ఇంతకు ముందు, 'మానవ హృదయాన్ని చిత్రించిన ఉత్తమ చిత్రంగా' ఎన్నిక కావడం విదితమే) ఇప్పుడు వెనిస్‌లో సంపాదించినది ప్రథమ బహుమతి.

అంతర్జాతీయ ఉత్సవంలో ప్రథమ బహుమతి గడించుకొన్న మొదటి భారతీయ చిత్రం రాజ్ కపూర్ నిర్మించిన 'జాగ్ తేరహో' (జెక్ ఉత్సవం)

సత్యజిత్ రాయ్ రెండవచిత్రం "అపరాజిత" కథ 'పథేర్ పాంచాలీ' చిత్రానికి తరువాయిభాగం. కీ. శే. మణిలాల్ వంధ్యోపాయ్ వ్రాసిన నవలలో కొంతభాగాన్ని మటుకే తొలి చిత్రంలో చూపించారు. ఆ మిగతా కథను, తరువాయి భాగమైన 'అపరాజిత' కథనూ కలిపి ఈచిత్రం నిర్మించారు. తొలి చిత్రంలో పాల్గొన్న నటులు కానూ బెనర్జీ, కరుణా బెనర్జీ, ఇందులో కూడా నటించారు. సంగీత దర్శకుడు పండిట్ రవిశంకర్.

విదేశాలలో పేరు గడించిపెట్టిన మరో బెంగాలీచిత్రం "కాబూలీవాలా" (దర్శకుడు తపన్ సిన్హా)లో రవిశంకర్ వినిపించిన సంగీతానికి బెర్లిన్ చలన చిత్రోత్సవంలో బహుమతి రావడం విదితమే. 



విక్రమ్ ప్రొడక్షన్స వారి 'కుటుంబ గౌరవం'లో ఇ. వి. సరోజ.

# సినిమా వార్తలు

ఈ సంవత్సరపు సంగీత రసప్రధాన చిత్రాలలో 'శ్రీ పాండురంగమాహాత్మ్యం' ఒకటి అని అంటున్నారు మంచి మంచి కీర్తనలూ, పద్యాలూ, శ్లోకాలూ, పాటలూ దాదాపు 22 వరకూ ఇందులో పొందుపరచి దర్శకుడు కమలాకర్ కామేశ్వరరావు దీన్ని తీర్చిదిద్దుతున్నారు ఘంటసాల, మాధవపెద్ది, సుశీల మొదలగువారంతా ఆయాగీతాలను పాడారు సంగీతదర్శకుడు టి వి (జయసింహ) రాజు పాటల రికార్డింగు, వాటిని సెల్యులాయిడ్ మీదకు తర్జుమా చేయడం కూడా పూర్తి అయింది కథాచిత్రణకూడా చాలవరకు పూర్తి అయినట్లే బహుశా అక్టోబరు నెలాఖరు నాటికి విడుదలకావచ్చును

నేషనల్ ఆర్ట్ థియేటర్స్‌వారు నిర్మిస్తున్న ఈ చిత్రంలో ఎన్ టి రామారావు, అంజలీదేవి, నాగయ్య, శివరావు, బాలకృష్ణ, పద్మనాభం, పేకేటి, వంగర, బొడ్డపాటి, బి సరోజ, ఋష్యేంద్రమణి, ఛాయాదేవి, అమ్మాజీ, నిమ్మి మొదలగువారు నటిస్తున్నారు రచన సముద్రాల జూనియర్, నృత్యాలు వెంపటి (సువర్ణసుందరి) సత్యం ఛాయాగ్రహణం ఎం ఎ రెహమాన్, కళాదర్శకుడు తోట, నిర్మాత ఎస్ త్రివిక్రమరావు, స్టుడియో వాహిని

## భూకైలాస్

ఎ వి ఎం వారు కన్నడ తెలుగు భాషలలో నిర్మిస్తున్న 'భూకైలాస్' దీపావళికి విడుదల కాగలదని తెలుస్తోంది ఇందులో రావణుడుగా రామారావు, నారదుడుగా నాగేశ్వరరావు నటిస్తున్నారు జమున, బి సరోజ ముఖ్యస్త్రీ పాత్రలు నిర్వహిస్తున్నారు రచన పరశురాం, దర్శకుడు శంకర్

## శ్రీకృష్ణమాయ

నాగేశ్వరరావు నారద పాత్ర నిర్వహిస్తున్న మరొక చిత్రం శ్రీ రాజరాజేశ్వరీ వారి 'కృష్ణమాయ' నారదుడు స్త్రీగా మారిపోయి సంసార సాగరాన్ని తరించ ప్రయత్నించడం ఇతివృత్తం నాగేశ్వరరావు పదిహేనేళ్ల నాడు నటుడుగా తొలిసారి కట్టిన వేషం నారదుడే

'కృష్ణమాయ' చిత్ర నిర్మాణం సగం పూర్తి కావచ్చింది సి ఎస్ రావు దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో నాగేశ్వరరావు, జమున, రఘురామయ్య, ఎ వి సుబ్బారావు, చదలవాడ కుటుంబరావు, ఛాయాదేవి, సూర్యకాంతం పాల్గొంటున్నారు మాటలు రావూరి, పాటలు రావూరి, బి వి ఎన్ ఆచార్య వ్రాస్తున్నారు టి వి రాజు సంగీతం సమకూర్చుతున్నారు ఛాయాగ్రహణ దర్శకుడు కమల్ ఘోష్

## 'బాలనాగమ్మ'

గత మాసం నెలకొన్న కొత్తసంస్థ శ్రీ వెంకటరమణా ఫిలింస్ వారు 'బాలనాగమ్మ' (లేక మాయలఫకీరు) చిత్రం నిర్మించ నిశ్చయించారు దీనికి సముద్రాల జూనియర్ మాటలూ పాటలూ వ్రాస్తున్నారు సంగీతం టి వి రాజు దర్శకుడు వేదాంతం రాఘవయ్య నిర్మాతలు బి సుబ్బరాజు, డి నరసింహరాజు

## రాజనందిని

రాఘవయ్యగారి దర్శకత్వాన తయారవుతున్న మరొకచిత్రం 'రాజనందిని' మల్లాది రామకృష్ణశాస్త్రి, దీనికి కథను రూపొందించి, మాటలూ పాటలూ వ్రాశారు టి వి రాజు సంగీతం సమకూర్చుతున్నారు జలరుహా పిక్చర్స్ పేరిట ఎం జగన్నాథరావు నిర్మిస్తున్న ఈ చిత్రంలో ఎన్ టి రామారావు, అంజలీదేవి ముఖ్యభూమికలు నిర్వహిస్తున్నారు

## 'జయభేరి'

అనేకవిధాల 'భారీ' అని అభివర్ణించతగ్గ రీతిని రూపొందుతున్న 'జయభేరి' చిత్రంలో దర్శకుడు పి పుల్లయ్యగారు సంగీతానికి విశేషప్రాధాన్యం ఇచ్చి నిర్మాణం సాగిస్తున్నారు సంగీతం ఘంటసాల వెంకటేశ్వరరావు సమకూర్చుతున్నారు పాటలు మల్లాది రామకృష్ణశాస్త్రి, మాటలు ఆత్రేయ వ్రాస్తున్నారు శారదాఫిలింస్ పేరిట తయారవుతున్న ఈచిత్రంలో నాగేశ్వరరావు,అంజలీదేవి, నాగయ్య ప్రభృతులు పాల్గొంటున్నారు స్టుడియో రేవతి

## భక్త రామదాసు

సంగీత రస ప్రధానమైన మరో చిత్రం 'భక్త రామదాసు' (వి ఎన్ ఫిలింస్) కూడ రేవతీ స్టుడియోలోనే తయారవుతోంది ఇందులో కబీర్ భజన్‌లను మహమద్ రఫీ పాడారు వాటికి అశ్వత్థామ సంగీతం కూర్చారు నాగయ్య, లింగమూర్తి, వసల సూర్యచంద్రరావు, రామన్న పంతులు, గౌరీనాథశాస్త్రి, రామశర్మ, ఎ వి సుబ్బా



విజయగోపాల్ ప్రొడక్షన్స్‌వారి "గంగాగౌరీ సంవాదం"చిత్రంలో జంగమదేవర వేషధారి మహేశ్వరుడుగా సిహెచ్ నారాయణరావు



అనుపమావారి 'ఎం ఎల్ ఎ.' చిత్రంలో నిర్మలగా సావిత్రి, ఎం ఎల్ ఎ గా జగ్గయ్య

రావు, కన్నాంబ, సూర్యకుమారి, కుసుమ మొదలగువారు నటిస్తున్నారు రచన యడవల్లి, పర్యవేక్షణ సముద్రాల, దర్శకుడు నాగయ్య

## సతీ అనసూయ

రాజశ్రీవారి 'సతీ అనసూయ' విజయదశమి కానుకగా విడుదల కాబోతోంది అంజలీదేవి, గుమ్మడి, జమున, సూర్యకళ, అమర్‌నాథ్, ముక్కామల, కాంతారావు, కె వి యస్ శర్మ, రాజనాల, పద్మనాభం మొదలగువారు నటించారు రాగిణి, కుచల కుమారి నృత్యాలు చేశారు

ఎన్ టి రామారావు ఇందులో 'గెస్ట్ ఆర్టిస్ట్‌'గా కనుపిస్తారు దర్శకుడు కె బి (కృష్ణ తులాభారం) నాగభూషణం

## కుటుంబ గౌరవం

విక్రం (తెనాలి రామకృష్ణ) ప్రొడక్షన్స్ వారి సాంఘిక చిత్రం "కుటుంబ గౌరవం" నిర్మాణం సగం పూర్తి అయింది అక్టోబరు నెలలో విడుదల చేయాలన్న సంకల్పంతో దర్శక నిర్మాత బి ఎస్ రంగా చురుకుగా నిర్మాణం సాగిస్తున్నారు. ఎన్ టి రామారావు, సావిత్రి, ఇ వి సరోజ,

బాలకృష్ణ, పద్మనాభం ప్రభృతులు పాల్గొంటున్నారు రచన అనిసెట్టి సంగీత దర్శకులు విశ్వనాథం, రామమూర్తి ఈ చిత్రం తమిళంలో కూడా తయారవుతోంది ★



క్వాత్రా ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి 'అదాలత్' చిత్రం సెట్ పైన, దర్శకుడు ఎం వి. రామన్‌తో ముచ్చటిస్తున్న నర్గీస్ ఈ చిత్రానికి దర్శకుడు కాళిదాస్.

# బొంబాయి సినిమా లేఖ

జెక్ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో ప్రథమ బహుమతి నందుకుని (జాగ్ తే రహో చిత్రానికని మీకు తెలుసు) ఝూంమని స్వదేశం వచ్చిన దర్శకనిర్మాత, నటుడు రాజకపూర్ శాంతాక్రజ్ విమానాశ్రయంలో వీరోచితస్వాగతం అందుకున్నాడు వేలాది అభిమానులూ, వందల నటులూ, పూల మాలలతో హర్షధ్వానాలతో ఎదురేగారు. రాజ్ కపూర్ తండ్రి పృథ్వీరాజ్, బావమరిది ప్రేమనాథ్, సాటినటుడు దిలీప్ కుమార్, మేటినటుడు మోతీలాల్, సంగీత దర్శకులు సలీల్ (జాగ్ తేరహో) చౌదరి, శంకర్, జైకిషన్ మొదలగు వారంతా ముందు వరసలో నిలచారు దిలీప్ కుమార్ రాజ్ కపూర్‌ను ప్రగాఢంగా ఆలింగనం చేసుకుని అభినందించాడు 'రాజ్ కపూర్ జాగ్ తేరహో' అంటూ జయధ్వానాలు చేశారు కాని రాజ్, వాటిని మించిన ఉచ్చస్వరంతో, 'జయధ్వానాలు నాకు కాదు భారత చలన చిత్ర పరిశ్రమ కే' అన్నాడు.

* * *

జెక్ ఉత్సవం అయిపోయాక కొన్నాళ్ళ పాటు రాజ్ కపూర్ యూరప్ దేశాల డిస్ట్రిబ్యూటర్లతో సంప్రతింపులుజరిపి, 'జాగ్ తే రహో' చిత్రాన్ని ఆ దేశాలలో విడుదల చేయడానికి ఏర్పాట్లుచేశారు దీన్ని మొత్తం 14 భాషలలోకి డబ్ చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి పశ్చిమ యూరప్‌లో ఈ చిత్రాన్ని డిలారెంటిస్ సంస్థ (వార్ అండ్ పీస్ నిర్మాతలు) విడుదలచేస్తుంది యూరప్‌కు ప్రారంభోత్సవ ప్రదర్శనం పారిస్ నగరంలోని ప్రిస్కో చార్మ్స్ థియేటర్ లో ఏర్పాటు చేస్తున్నారు

బొంబాయిలో అడుగిడిన మర్నాటినుం స్థానిక నిర్మాతలు పలువురు రాజ్ ను త తమ చిత్రాలలో నటించకోరుతూ చుట ముట్టారు రాజ్ ఇపుడు 5 చిత్రాలలో ఉన్నాడు వీటిలో మొట్టమొదట (త్వ లోనే) విడుదల కాగలచిత్రం శ్రీ ఎల్ వి ప్రసాద్ నిర్మిస్తున్న 'శారద'

ఈలోగా, తన స్వంతచిత్రం 'దిల్లీ అజ దూర్ నహీం'ని త్వరలోనే విడుదలచేయ డానికి రాజ్ సన్నాహాలు ఆరంభించాడు

* * *

రాజ్ కపూర్ వచ్చిన రెండు రోజులకి పద్మిని, రాగిణి, మాస్కో నుండి తిరి వచ్చారు అక్కడ వారు ఇండో సోవియట్ చిత్రం 'పరదేశి' షూటింగ్ లో పాల్గొన్నారు ఆ పైన మాస్కో యువజనోత్సవంలో నృత్యప్రదర్శనాలిచ్చి, అంతర్జాతీయ నృత్య పరీక్షలో శాస్త్రీయ నృత్యాని ప్రథమ బహుమతిని సంపాదించుకొన్నారు ఇద్దరూ రెండేసి సువర్ణ పతకాలూ ఒక్కొక్క డిప్లమా అందుకొన్నారు ఆన రష్యాలోని కొన్ని ప్రధాన కేంద్రాలలో పర్యటించి నృత్యప్రదర్శనాలిచ్చారు

పనిలో పనిగా పద్మినీ రాగిణీ ప్రముఖ నర్తకి తమారా కౌనూన్ వద్ద ఉజ్బెక్ నృత్యం అభ్యసించారు

"ఈ విద్య, ఇంతకు మించిన మధు స్మృతులు తెచ్చుకున్నాం మా వెంట అన్నారు వాళ్లు

త్వరలోనే ఈ ఇద్దరూ మనదేశంలో ఉజ్బెక్ నృత్యప్రదర్శనలు ఇవ్వాలని సం ల్పించారు

* * *

తారల గిరాకీ తారాపథాన్నంటింది ఇపుడు, అందరికన్న ఎక్కువ రుసుమ వసూలుచేసే "నలుగురు నటీనటులు దిలీ కుమార్, దేవానంద్, రాజ్ కపూర్, నర్గిస్

ఆ తరువాతివారు (తేడా బహు కొద్ది వైజయంతిమాల, మీనాకుమారి, నూతన్ అశోక్ కుమార్, కిశోర్ కుమార్, మధుబాల అచిరకాలంలోనే ఈ స్థాయికి వచ్చి అరంకెల చెక్కు నందుకోగల మరొక తా వహీదా రెహమాన్

అగ్రశ్రేణి తారల రుసుములు ఏ స్థాయిలో ఉన్నాయో దీన్నిబట్టిఊహించుకోవచ్చును

* * *

నటుడు దేవానంద్, నవంబరు 1వ తేదీ నవకేతన్ ఫిలింస్ పేరిట కొత్త చిత్ర 'కలాపాని' ఆరంభించాడు హత్యానేర యావజ్జీవ శిక్షకు గురిఅవుతున్న ఒక వ్యక్తిని రక్షించడానికి అతని కుమారుడ పూనుకొని, అసలు హంతకులని పట్టుకోవడం కథాంశంగా గల ఈ అపరా



అశోక్ పిక్చర్సువారి 'రాగిణి' చిత్రంలో జబీన్, కిశోర్.



పరిశోధక చిత్రానికి రాజ్ ఖోస్లా దర్శకత్వం నిర్వహిస్తున్నారు నేరం ఆచూకీ తీయబోయిన ఈ కథానాయకుడికి ఇద్దరు నాయికలు యథాశక్తి సహాయం చేస్తారు వారిలో ఒక చిన్నది ఒక పత్రికకు విలేఖరి చివరకు ఆమె అతన్ని పెళ్లాడుతుంది రెండో యువతి వేశ్య అతన్ని గెలిపించి, ఆమె ఓడిపోతుంది నాయకుడుగా దేవానంద్, రిపోర్టరుగా వహీదా రెహమాన్, వేశ్యగా నళినీ జయవంత్ నటిస్తారు మరొక ముఖ్యభూమిక (పబ్లిక్ ప్రాసిక్యూటర్)ను కిశోర్ సాహు నిర్వహిస్తాడు నవకేతన్‌వారి తాజాచిత్రం 'నౌ దో గ్యారా' సంగీత దర్శకుడు శచిన్‌దేవ్ బర్మన్ దీనికీ సంగీతం సమకూర్చుతారు.

* * *

దర్శక నిర్మాత మెహబూబ్ తన కొత్త చిత్రం "మదర్ ఇండియా"కు రంగులలో ప్రతులు తీయించే నిమిత్తం లండన్ వెళ్లారు ఆ చిత్రం ప్రారంభోత్సవ ప్రదర్శనంకూడా లండన్‌లోనే జరుగుతుంది నాయికానాయకులు నర్గీస్, సునీల్‌దత్‌లను బ్రిటిష్ ప్రేక్షకులకు అప్పుడు పరిచయం చేస్తారు

* * *

దర్శకనిర్మాత ఎం వి రామన్‌కూడా లండన్‌లోనే ఉన్నారు ఆయన నిర్మిస్తున్న 'ఆశా' చిత్రంలోని కొన్ని సన్నివేశాలను రంగులలో ప్రతులు తీయిస్తున్నారు ఆ చిత్రం త్వరలోనే విడుదలకాబోతోంది వైజయంతిమాల, కిశోర్‌కుమార్ ఇందులో ముఖ్యభూమికలు నిర్వహించారు వైజయంతిమాల నృత్యాలు, సి రామచంద్ర సంగీతం, ఇందులో విశేషాకర్షణలు

* * *

గత వారం పృథ్వీ థియేటర్స్ వారి 'పైసా' చిత్రం విడుదల అయింది నిర్మాత పృథ్వీ రాజ్ కపూర్, రచనా, దర్శకత్వంకూడా నిర్వహించారు రంగస్థల నటులే ముఖ్యపాత్రలు ధరించారు మంచి నాటకంగా రాణించిన ఈ 'పైసా' చివరకు చలనచిత్రంగా పూర్తిగా దెబ్బతింది 'స్క్రీన్‌ప్లే' సవ్యంగా రూపొందించనందువల్ల కథ జవసత్వాలుడిగి చప్పగా తయారైంది నిజానికి ఇందులో సినిమాకు అవసరమైన ప్రయత్నం ఏమీ లేదనిపిస్తుంది ఉన్నదున్నట్టుగా నాటకాన్నే తెరమీదకు ఎక్కించారు దానా దీనా తెరమీద నటన అనేది కనబడదు చైతన్యం లేదు ఉన్నవల్లా పొడుగుపాటి సంభాషణలు

ఈ చిత్రంలో బాగున్నదల్లా సంగీతమే. అది సమకూర్చినవాడు రామ్‌గంగూలీ ★

('ఆంధ్ర వారపత్రిక' బొంబాయి విలేఖరి)



అనుపమావారి 'ఎం ఎల్ ఏ' దాసుగా జగ్గయ్య

## బడిపంతులు బ్రాండన్

(5-వ పేజీ తరువాయి)

వుండగానే ఇతడు ఒక చర్చికి అనుబంధితమై పనిచేస్తున్న చిన్నపిల్లల పాఠశాలకు తరుచూ వెళ్ళి అక్కడి పరిస్థితులను శ్రద్ధాసక్తులతో పరిశీలిస్తుండేవాడు తర్వాత డిగ్రీకోర్సు చదువుతూండగా ప్రాక్టికల్ ట్రెయినింగ్ కోసం ఒక కిండర్ గార్టెన్ తరగతికి పాఠం చెప్పవలసిన బాధ్యత ఇతడిపైన పడింది తన అభిరుచికీ ఉత్సాహానికీ తగిన అవకాశం అప్పటిలో ఆవిధంగా లభ్యమైంది

ఆరేళ్ళక్రితం పట్టభద్రుడైన తర్వాత, అమెరికన్ సైన్యంతో వెళ్ళి కొరియాలో రెండేళ్ళపాటు బ్రాండన్ పనిచేశాడు 1956లో ఐదోతరగతి పిల్లలకు పాఠాలు చెప్పి వారి లేతహృదయాలను బాగా ఆకర్షించగలిగాడు తిరిగి ఈ సంవత్సరం హవాయి దీవులలోని కిండర్ గార్టెన్ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేయడానికి వెళ్లబోతున్నాడు

ఇరవై రెండేళ్ల వయస్సులో వుండగానే ఓహియో రాష్ట్రంలోని విల్లోబీ అనే పట్టణంలోని చిన్న బడిలో ఉపాధ్యాయుడుగా బ్రాండన్ నియుక్తుడైనాడు. ఒక మొగవాడు తమవూరి చిన్న పాఠశాలకు ఉపాధ్యాయుడుగా రావడం అక్కడి తలిదండ్రులకు ఆశ్చర్యం కలిగించింది కిండర్ గార్టెన్ తరగతికి మొగవాళ్లు కూడా పాఠాలు చెప్పగలరనే విషయాన్ని పిల్లల తల్లులు నమ్మలేకపోయినారు ఉదయం, సాయంత్రం ఆడపిల్లలు, మొగపిల్లలు కలసి 30 మందికిపైగా ఆ బడికిహాజరయే వాళ్లు ఆ పిల్లలు ఇతడిని 'మిస్ బ్రాండన్' అనీ, 'మిసెస్ బ్రాండన్' అని (స్త్రీ లింగ ప్రయోగంతో) పిలవడం మొదలుపెట్టారు.

డిక్ బ్రాండన్‌ది మంచి కంఠం పియానో వాయిస్తూ పిల్లలచేత పాడిస్తాడు, వారిచేత అభినయంచేయిస్తాడు, అప్పుడప్పుడు వారితో కలసి తనూ పాడతాడు వారితో కలసి ఆడుకుంటాడు పాఠాలు చెప్పవలసినప్పుడు చెబుతాడు ఉపాధ్యాయిని కంటే ఎక్కువ లాలనతో, పాలనతో తన తరగతిని నిర్వహిస్తాడు చివరకు శభాష్ అనిపించుకున్నాడు

"ఐదారేళ్ల చిన్న పిల్లలకు పాఠాలు చెప్పడానికి ఆడవాళ్లే వుండాలని మొగవాళ్ళు ఇందుకు అనర్హులనీ వాదించే వాళ్లు అసలు రహస్యం అర్థంచేసుకోలేకపోతున్నారన్నమాట," అంటాడు బ్రాండన్. తనలాంటి యువకులు ఇంకా ఎక్కువమంది ముందుకు వచ్చి కిండర్ గార్టెన్ తరగతులకు పాఠాలు చెప్పాలని ప్రబోధిస్తాడు.

—యు ఎస్ ఐ ఎస్]

## విక్రమార్కుడి మార్కు సింహాసనం

(12 వ పేజీ తరువాయి)

రామనాథం

* * *

"అదిగో భద్రాద్రి!" అన్నాడు రాజా హఠాత్తుగా

ఏదిగో?

"అదిగో!" అన్నాడు రాజా ఒక షెడ్డను చూపించి

"అది స్టుడియో కాదు రాజీ కాఫీ హోటలు స్టుడియోలు చాలా పెద్దవి ఇంకొంచెం ముందుకు చూడు అల్లదిగో భద్రాద్రి! వెళ్లిరా" అన్నాడు రామనాథం మలుపు తిరుగుతూ ★

## కృష్ణన్ మృతికి సంతాపం

దక్షిణభారత ఫిలిం వాణిజ్యమండలి ఆధ్వర్యాన సెప్టెంబరు 8వ తేదీ సాయంత్రం మండలి కార్యాలయంలో జరిగినసభలో తమిళ హాస్యనటుడు ఎన్ ఎస్. కృష్ణన్ మృతికి సంతాపం ప్రకటించి, ఆయన కుటుంబానికి సానుభూతి తెలుపుతూ తీర్మానం చేశారు పలువురు తెలుగు తమిళ చలనచిత్ర కళాకారులు కృష్ణన్ ప్రతిభాసంపత్తిని, గుణగణాలను ప్రస్తావించి ప్రశంసించారు. ★

## వనితా వాణి

(42-వ పేజీ తరువాయి)

లేక నానా యాతనా పడ్డాము.

మా ఇంట్లో మొన్న పుడికోప కుట్టిందండీ (పురికోస) అయినా మా ఇంట్లో జేళ్ళు, తేళ్ళు చాలా వున్నాయి బాబూ (తేళ్ళు జెర్రిలు) అంది ఓ ఇల్లాలు. మొన్న ఆ పెళ్ళి కూటురు (పెళ్ళికూతురు) జరలో పెట్టుకున్న (జడలో పెట్టుకున్న) ఎల్ల గుత్తాబీపూలు (ఎర్రగులాబీ) ఎంత బాగున్నాయో అంది ఓ అమ్మాయి. ఆ బూస్లేంటు(పేంటు) వేసుకున్న పాత్తి (పాట్టి) అబ్బాయికి ఎన్ని ఈళ్ళుంటాయి (ఏళ్ళుంటాయి) అన్నారొకరు. అమ్మా ఈ రిజస్త్రీ వుస్తరం (రిజిష్ట్రీ వుత్తరం) ఎక్కడనుంచి ఒస్సిందే? (ఒచ్చిందే?) అంది ఓ అమ్మాయి. అపరికికి కొంచెం కట్టి కుత్తిరించి పెట్టమ్మా (పట్టి, కత్తిరించి పెట్టమ్మా) అంది ఓ ఆవిడ. ఇవాళ కోరుచారమా? (చారు కారమా?) అని మరో ఆవిడ అన్నారు. ఈ విధంగా కంగారు పడిపోయి మట్లాడుతున్నప్పుడు ఓ లక్షణ త్తి మాటలయినా వొస్తూవుంటాయి. తప్పటు కాని వాళ్ళయితే ఎదురుగుండానే నవ్వేస్తాము. లేకపోతే ఇంక ఎదుటివాళ్ళ పని అయినట్టే ఒకళ్ళని చూచి ఒకళ్ళు ముక్కి, ముక్కి నవ్వుతాము. దానంతకి కారణం తొందరే. ఆ గాబరాలో వెనక మాటకి పెట్టవలసిన దీర్ఘాలు ఒతులు ముందు వాటికి, వీటికి పెట్టవలసినవి వాటికి పెట్టేస్తూ వుంటారు. అంత తొందరపడి నానావంకర మాటలూ మాట్లాడి నలుగురిలో నవ్వించుకునే కంటే వీలయినంత నిదానంగా మాట్లాడటమంత వుత్తమము మరొకటి లేదు. ★

తాళ్ళూరి వెంకట మహాలక్ష్మి.
కాకినాడ.

## రాత తెలుసుకుంటే

(49-వ పేజీ తరువాయి)

చెయ్యి - ఎవరన్నా నీ దగ్గరకువస్తే విలువైన రత్నాన్ని తీసుకొస్తేనే గాని రానివ్వనని చెప్పు" అన్నాడు బుద్ధిశాలి. మనోహారి అట్లాగే చెయ్యటంవల్ల, 'రత్నం' పట్టుకుని ఎవరూ రాలేదు. అర్ధరాత్రి దాటిపోయింది. బ్రహ్మ ఉలిక్కిపడ్డాడు. నిత్యం వేశ్యాజీవనం చెయ్యాల్సిన మనోహారికి ఈరాత్రి, రాత తప్పిపోతుందా అనుకుంటూ లేచి, ఒక రత్నాన్ని తీసుకొచ్చి ఆమెకు ఇచ్చాడు. మనోహారి లోనికి రానిచ్చింది.

ప్రతి రాత్రి. అంతే—బ్రహ్మదేవుడే రోజూ రావాల్సివస్తున్నది. ఇటు ఈమెకు ఒకరత్నం, అటు భాగ్యశాలికి ఆ బండి, ఎడ్లూ ఏర్పాటు చెయ్యటంలో సతమతమయిపోతున్నాడు. పోతే, మనోహారి, భాగ్యశాలి భాగ్యవంతులూ కాసాగారు.

కొన్నాళ్ళకు బ్రహ్మదేవుడికి విసుగుపుట్టి బుద్ధిశాలి దగ్గరకు పోయి—"ఇదానీ నిర్వాకం—పోనీ గదా అని చెబితే?" అన్నాడు. బుద్ధిశాలి నవ్వాడు. "మీరు సరిగా రాస్తే ఈ బాధలు తప్పేవిగా!" అన్నాడు. బ్రహ్మదేవుడు అగమ్యంగా, చేసేదిలేక చూశాడు.

కానివ్వండి. వాళ్ళిద్దరూ బ్రతికి వున్నంతకాలం మీకు ఈ బాధ్యత తప్పదు. సృష్టికర్తలు మీరే నేను పోయాలి" అన్నాడు బుద్ధిశాలి వ్యంగ్యంగా, తన తెలివితేటలు పని చేసినందుకు సంతోషపడుతూ.

బ్రహ్మ సమాధానం చెప్పలేదు—మనసులోనే ఎవర్నో నిందించుకుంటూ, నెమ్మదిగా బ్రహ్మలోకం చేరుకున్నాడు! ★

## ప్రణాళిక అంచనాల తారుమారు

(4-వ పేజీ తరువాయి)

వాలు అనిశ్చితంగా ఉండడంచేతనే విదేశీ పెట్టుబడుల అవకాశాలు కూడా అనిశ్చితంగా ఉన్నాయి.

ఈ కారణాలవల్ల, ప్రణాళికను పునర్వ్యవస్థీకరించుకోవలసిన అవసరం ఏర్పడిందని, దేశంలోను, దేశం వెలుపలా లభ్యమయ్యే ధనాన్ని దృష్టిలో పెట్టుకుని పెట్టుబడి కార్యక్రమాలను సాగించాలని, ఈపని వెంటనే ఖచ్చితంగా జరిగి తీరాలని రిజర్వ్ బ్యాంక్ హెచ్చరించింది.

కేంద్ర ప్రభుత్వం కూడా ఈవిషయం గురించి ప్రణాళికను సంస్కరించడానికి పూనుకొన్నది. అయితే ప్రణాళికలోని ఉక్కు, బొగ్గు ఉత్పత్తి, రైల్వేలు, విద్యుచ్ఛక్తి ఇత్యాది ముఖ్య కార్యక్రమాలను అమలుచేసి తీరతామనీ, మొదలుపెట్టి కొంత డబ్బు ఖర్చు చేసిన పనులను మధ్యలో నిలుపు చేయడం అసంగతమనీ ఆర్థిక మంత్రి ప్రకటించారు. మొదట అనుకున్న 4800 కోట్ల రూ. ల అంచనాకు తగినట్టుగా వారు ప్రణాళికను సంస్కరింప దలిచారు. అయితే ప్రణాళిక ముగిసేలోగా ధరలు ఇంకా పెరిగి, 4800 కోట్ల రూ.లు వ్యయమైతే కావచ్చుగాని, ఇంకా ఎన్ని కార్యక్రమాలను తగ్గించుకోవలసి వస్తుందో తెలియదు. ఈ పరిస్థితుల్లో వీరు యూరప్, అమెరికాల్లో జరపబోయే ఆర్థిక రాయబారాలు ఎంతవరకూ నెగ్గుతాయో చెప్పడం కష్టం. ★

> ఒకాయన : మీరిచ్చిన మందు వాడినా మా వాడికి రాత్రంతా కన్ను మూత పడలేదండి!
>
> డాక్టరు : అదేమిటండి! నిద్ర పోవాలంటే కళ్లుమూసుకొని పడుకోవాలి!
>
> * * *
>
> ఒకడు : (పెద్దగా) పాటకచ్చేరి ఎలాగున్నది?
>
> రెండవవాడు : జనం బాగానే వచ్చారు. కచ్చేరిచేసిన ఆయన మూగవాడిలాగా ఉన్నట్లున్నాడు.




Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

